Khutbaat-III
Haqeeqat-e-Saum wa Salaat
(Telugu)

# ఆరాధనల వాస్తవికత

మూలం:

మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూదీ *(రహ్మాలై)*

అనువాదం:

ఎస్సెమ్ ఖాద్రి

# విషయ సూచిక

بسم الله الرحمن الرحيم

అనంతకరుణామయుడు అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

అనంతకరుణామయుడు అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# ఆరాధనల వాస్తవికత

## ఆరాధన

ముస్లిం సోదరులారా! గత ప్రసంగంలో నేను 'దీన్' అంటే ఏమిటో, షరీఅత్ అంటే ఏమిటో తెలిపాను. ఈ రోజు, ముస్లిములు సాధారణంగా వాడే ఓ పదాన్ని గురించి వివరంగా చెబుతాను. అయితే ఆ పదానికి సరియైన అర్థం కొంతమందికే తెలుసు. అది ఇబాదత్ (ఆరాధన) అన్న పదం.

దైవం తన దివ్యగ్రంథంలో "వమా ఖలఖ్తుల్ జిన్న వల్ ఇన్స ఇల్లా లియ'బుదూన్" అని సెలవిచ్చాడు. అంటే "నేను జిన్నుల్ని, మనుషుల్ని నా ఆరాధన చేయడానికి తప్ప మరే ఉద్దేశ్యంతో సృజించలేదు" అని. ఈ ఆయత్ ద్వారా తెలిసిందేమిటంటే మీ పుట్టుక, మీ జీవిత ధ్యేయం అల్లాహ్ ఆరాధన తప్ప మరేమీ కాదు. ఇప్పుడు మీరే ఊహించగలరు ఇబాదత్ అన్న పదానికి అర్థం తెలుసుకోవడం ఎంత అవసరమో! ఒకవేళ దీని సరైన అర్థం ఏమిటో తెలుసుకోకపోతే పుట్టుక ఉద్దేశ్యాన్ని మీరు నెరవేర్చలేరు. ఒక వస్తువు తన ఉద్దేశ్యాన్ని నెరవేర్చకపోతే అది నిష్ప్రయోజనం. ఓ డాక్టరు తన రోగిని నయం చేయలేకపోతే అతడు తన చికిత్సలో విఫలుడయ్యాడని, రైతు పంటను పండించలేకపోతే అతడు వ్యవసాయంలో విజయం సాధించలేదని, ఇదే విధంగా మీరు మీ జీవిత

నిజ ధ్యేయం అంటే ఆరాధనను నెరవేర్చలేకపోతే మీ పూర్తి జీవితమే విఫలం అయింది అని అర్థం. కాబట్టి మీరు సావధానంగా ఆరాధనా భావాన్ని విని, అర్థం చేసుకుని దాన్ని మీ హృదయాల్లో పొందుపర్చుకోవాలనే నేను కోరుకుంటున్నాను. ఎందుకంటే దీనిపైనే మీ జీవితం సఫలం లేక విఫలం అవడం ఆధారపడి ఉంటుంది.

'ఇబాదత్' అనే పదం 'అబ్ద్' నుండి వచ్చింది. అబ్ద్ అంటే దాసుడు, బానిస. కాబట్టి ఇబాదత్‌కు అర్థం దాస్యం, బానిసత్వం. ఏ వ్యక్తి అయినా ఒకరికి దాసుడై అతని సేవలో దాసునిగానే ఉంటూ, ఓ యజమాని ఎడల ఎలా ప్రవర్తించాలో అలా ప్రవర్తిస్తే ఇది దాస్యం, ఇబాదత్. దీనికి విరుద్ధంగా ఓ వ్యక్తి ఒకరి దాసుడై తన యజమాని నుండి జీతభత్యాలు పూర్తిగా వసూలు చేస్తూ తన యజమాని సమక్షంలో దాసునిగా ప్రవర్తించక పోతే ఆ ప్రవర్తనను 'అవిధేయత' తలబిరుసుతనంగా చెప్పబడుతుంది. నిజం చెప్పాలంటే దీన్ని 'విశ్వాసఘాతుకం' అని అనవచ్చు.

యజమాని ఎడల దాసుల్లా ప్రవర్తించవలసిన విధానం ఏమిటో ఇప్పుడు ఆలోచించండి.

దాసుని మొట్టమొదటి పని, యజమానిని యజమానిగా తలచడం. అంటే నా స్వామి, నా ప్రభువు నాకు ఉపాధినిచ్చేవాడు, నన్ను రక్షించి కాపలా కాసేవాడు - ఆయనకే విశ్వాసపాత్రునిగా ఉండడం నా విధి. ఆయన తప్ప మరెవరూ నా దాస్యానికి, నా విధేయతకు పాత్రులు కారు అని తలచడం.

దాసుని రెండో పని, ఎల్లవేళలా యజమానిని సేవించడం, ఆయన ఆజ్ఞల్ని పాలించడం, ఆయన సేవ నుండి విముఖతను చూపకుండా ఉండడం, తన యజమాని అభీష్టానికి వ్యతిరేకంగా తానూ ఏమీ చేయకపోవడం, ఇతరుల

మాటా వినకపోవడం. బానిస అన్ని పరిస్థితుల్లోను సేవకుడే. యజమాని యొక్క ఫలానా మాటను వింటాను, ఫలానా మాటను విననని లేక ఫలానా సమయం వరకే బానిసను మిగతా సమయంలో నేను స్వతంత్రుణ్ణి అనే హక్కు లేదు బానిసకు.

దాసుని మూడో పని యజమానికి మర్యాద చూపడం, ఆయన్ని ఆదరించడం. మర్యాదకు, ఆదరణకు స్వామి నిర్ణయించిన విధానాన్నే అనుసరించడం. ఏ సమయమైతే గౌరవ వందనం కోసం ఆయన కేటాయించాడో ఆ సమయంలో తప్పక ఆయనముందు హాజరు కావాలి. విశ్వాసంలో, విధేయతలో తాను దృఢంగా ఉన్నాను అని రుజువు చెయ్యాలి.

ఈ మూడు విషయాల కలయికే ఆరాధన. మొదటిది యజమాని ఎడల విశ్వాసం, రెండోది యజమాని ఎడల విధేయత, మూడవది ఆయన పట్ల మర్యాద చూపడం, ఆయన్ని ఆదరించడం.

*"అల్లాహ్ జిన్నుల్ని, మనుషుల్ని సృష్టించింది కేవలం ఆయనకు విధేయులై ఉండడానికే"* అని సెలవిచ్చిన దానికి అర్థం ఏమిటంటే, వారు కేవలం అల్లాహ్‌కే విశ్వాసపాత్రులుగా ఉండాలని, ఆయనకు వ్యతిరేకంగా ఇతరులకు విశ్వాసపాత్రులు కాకూడదనీను. కేవలం అల్లాహ్ ఆజ్ఞల్నే శిరసావహించాలి. దానికి వ్యతిరేకంగా మరెవ్వరి ఆజ్ఞలూ పాలించకూడదు. ఆయన సమక్షంలోనే ఆదరణ భావంతో తల వంచాలి. మరెవ్వరి ముందు తలవంచరాదు. ఈ మూడు అంశాలనే అల్లాహ్ ఇబాదత్ (ఆరాధన) అన్న సమగ్ర పదం ద్వారా వివరించాడు. ఖుర్‌ఆన్‌లో ఆరాధన గురించి ఆదేశించే వాక్యాలన్నిటిలోను ఉన్న భావం కూడా ఇదే. అంతిమ దైవ ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం)కు పూర్వం వచ్చిన దైవప్రవక్తలందరి బోధనల సారాంశం కూడా "అల్లా తఅబుదు ఇల్లా ఇయ్యాహ్" అంటే అల్లాహ్ తప్ప మరెవరినీ ఆరాధించరాదు అన్నదే. అంటే కేవలం పాలకుడు ఒక్కడే, ఆయనకే మీరు విశ్వాసపాత్రులై

ఉండాలి. ఆ పాలకుడు అల్లాహ్‌యే. కేవలం ఒకే ఒక చట్టాన్ని అనుసరించాలి. ఆ చట్టం అల్లాహ్ చేసిన చట్టమే. మీరు పూజించవలసింది ఒక్కడినే. ఆయనే అల్లాహ్.

ఆరాధనకు సంబంధించిన ఈ భావాన్ని మనసునందుంచుకొని, కాస్త నా ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వండి.

తన యజమాని నియమించిన డ్యూటీకి వెళ్ళేబదులు ఎల్లవేళలా ఆయన సమక్షంలోనే చేతులుకట్టుకుని నిలబడి లక్షలాదిసార్లు ఆయన నామాన్నే జపించే సేవకుని గురించి మీ అభిప్రాయం ఏమిటి? యజమాని, వెళ్ళి ఫలానా వారికి వారి హక్కుల్ని ఇవ్వు అని ఆజ్ఞాపిస్తే అక్కడ నుండి కదలకుండా వంగి పదేసి దండాలు పెట్టి తిరిగి చేతులు కట్టుకొని నిలబడతాడు అతడు. యజమాని అతనితో వెళ్ళి ఫలానా చెడుల్ని నిర్మూలించు అని ఆజ్ఞాపిస్తే అతడు తన స్థానంనుండి ఓ అడుగు కూడా కదపకుండా అక్కడనే సాష్టాంగ ప్రణామాలు చేస్తుంటాడు, యజమాని వెళ్ళి దొంగ చేతిని నరికేయి అని ఆదేశిస్తే అక్కడనే నిలబడి "దొంగ చేతిని నరికేయి, దొంగ చేతిని నరికేయి" అని ఇరవైయేసి మార్లు ఎంతో మధురంగా గానం చేస్తుంటాడు, కాని ఒక్క మారైనా దొంగ చేతిని నరికే వ్యవస్థను స్థాపించే ప్రయత్నం చేయడు. ఈ దాసుడు నిజంగా తన యజమాని దాస్యం చేస్తున్నాడని మీరు అనుకోగలరా? ఒకవేళ మీ సేవకుడే ఈ ధోరణిని అవలంబిస్తే మీరేం చేస్తారో నాకు తెలియదుగాని దైవదాసుడు ఇలా చేస్తూ ఉంటే మీరు అతణ్ణి గొప్ప భక్తుడని అంటారు. అదే ఆశ్చర్యకరమైన విషయం. ఈ క్రూరుడు పొద్దస్తమానం దైవగ్రంథంలో దైవాజ్ఞల్ని ఎన్నోసార్లు పఠిస్తూ ఉంటాడు. ఆ ఆజ్ఞల్ని శిరసావహించడానికి తానున్న చోటనుండి రవ్వంతైనా కదలడు సరికదా ఎన్నో నఫిల్ నమాజులు చేస్తాడు. వెయ్యి పూసల జపమాలపై దైవనామాన్ని జపిస్తాడు. ఎంతో మధురమైన కంఠంతో దివ్యఖుర్‌ఆన్ పారాయణం చేస్తాడు. అతని ఈ చర్యల్ని చూసి

మీరేమో అతణ్ణి పరమ నిష్ఠగల దైవభక్తుడని అంటారు. ఈ పొరపాటు ఎందుకు జరిగిందంటే మీకు అసలు ఆరాధన భావం ఏమిటో తెలియదు గనుక.

మరో సేవకుడున్నాడు. రేయింబవళ్ళూ డ్యూటీ అయితే చేసేది ఇతరులది. ఆజ్ఞల్ని, ఆదేశాలను పాలించేది ఇతరులవి. నడుచుకునేది ఇతరుల చట్టాలపై. ఇలా అతడు తన అసలు యజమాని ఆజ్ఞల్ని ఎల్లవేళలా ఉల్లంఘిస్తూనే ఉంటాడు, అయితే వందన సమర్పణ చేసుకునే టైముకాగానే ఆ యజమాని ముందుకువచ్చి నిలబడతాడు. తన నోటి ద్వారా ఆ యజమాని నామాన్నే జపిస్తాడు. మీలో ఎవరి నౌకరైనా ఇలాంటి ధోరణిని అవలంబిస్తే మీరేం చేస్తారు? అతని వందనాన్ని, అతని వినయాన్ని అతని ముఖాన పారేయరూ? అతడు తన నోటితో మీరే నాకు యజమాని, ప్రభువు అని అంటే, నువ్వు అతినీచుడవు, అసత్యవాదివి, విశ్వాసం లేనివాడివి, జీతభత్యాలు తీసుకునేది నానుండి, ఉద్యోగం చేసేది మరొకరిదా?

నోటితో నన్ను యజమాని, ప్రభువు అంటావు. యదార్థంగా నాకు తప్ప ఇతరులందరికీ ఊడిగం చేస్తావు అని అడగరా? ఇది సాధారణంగా అందరూ అనేమాటే. అయితే, రేయింబవళ్ళెవరైతే దైవచట్టాల్ని ధ్వంసం చేస్తున్నారో, దైవ తిరస్కారులు, బహుదైవారాధకుల ఆదేశాలపై నడుచుకుంటున్నారో, తమ జీవిత వ్యవహారాల్లో దైవాదేశాలను లెక్కచేయరో, వారి నమాజులు, రోజాలు, తస్బీహ్‌లు (దైవ నామస్మరణలు), దైవగ్రంథ పారాయణం, హజ్, జకాతులను చూసి మీరు దైవారాధనగా భావించడం ఎంత ఆశ్చర్యం! ఇలా తప్పుగా అర్థం చేసుకోవడానికి కూడా కారణం మీరు ఆరాధనకు సంబంధించిన అసలు భావాన్ని తెలుసుకోలేకపోవడమే.

మరో నౌకరు ఉదాహరణ తీసుకోండి. యజమాని తన నౌకర్ల కోసం ఏ యూనిఫాం అయితే కేటాయించాడో దాన్ని అతడు ఎలాంటి హెచ్చుతగ్గుల్లేని

కొలతలతో కుట్టించి తొడుగుతాడు. గొప్ప వినయం ఉట్టిపడేలా యజమాని సన్నిధిలోకి హాజరౌతాడు. ప్రతి ఆదేశాన్ని విని, ఆయనముందు మోకరిల్లి "చిత్తం ప్రభూ" అని పలుకుతాడు - అంటే తనంతటి విధేయుడైన సేవకుడు మరొకడు లేడు అన్నంత వినయంగా. యజమానికి వందనం సమర్పించేటప్పుడు అందరికంటే ముందుకు వచ్చి నిలబడతాడు. యజమానిని పొగడటంలో, ఆయన నామాన్ని జపించడంలో ఇతర నౌకర్లందరికంటే తానే ముందుంటాడు. మరోవంక ఈ వ్యక్తి తన యజమాని శత్రువులు, తిరుగుబాటుదారుల సేవలోనే ఎల్లవేళలా నిమగ్నుడై ఉంటాడు. తన యజమానికి వ్యతిరేకంగా వారు చేసే కుట్రల్లో భాగం పంచుకుంటాడు. యజమాని పేరును ప్రపంచం నుండి తుడిచివేయడానికి వాళ్ళు చేసే ప్రతి కృషిలో సహాయపడతాడు. రాత్రిపూట చీకట్లో తన యజమాని ఇంటికి కన్నం కూడా వేస్తాడు. ఉదయాన్నే లేచి విధేయులైన నౌకర్లలా వచ్చి యజమాని ముందు నిలబడతాడు. ఇలాంటి నౌకరు గురించి మీ అభిప్రాయం ఏమిటి? వాడు కపటి, విద్రోహి, కృతఘ్నుడు అనే కదా మీరనేది. దేవుని ఇలాంటి బానిసల్ని గురించి మీరేమంటున్నారు? ఒకరిని పీరు సాహెబ్‌లని, మరొకరిని మౌలానా అని, వేరొకరిని ధర్మపరాయణు లని, దైవభీతికలవారని, ఆరాధనాపరులనే కదా! వారి ముఖంపై పూర్తి కొలతల్తో ఉన్న గెడ్డాలను చూసి, చీలమండలపైకి రెండేసి అంగుళాల ఎత్తుగల వారి పైజామాలను చూసి, వారి నుదుటన నమాజు చేయగా ఏర్పడిన బొడిపల్ని చూసి, వారి సుదీర్ఘమైన నమాజుల్ని చూసి, వారు జపించే లావుపాటి జపమాలలను చూసేకదా మీరు అనుకునేది వాళ్ళు గొప్ప దైవభక్తులని? ఈ అపార్థం కూడా మీరు ఆరాధనకు, ధార్మికతకు సరైన అర్థం తెలుసుకోకపోవడమే.

ఖిబ్లా వైపునకు తిరిగి చేతులుకట్టుకుని నిలబడడం, మోకాళ్ళపై చేతులు పెట్టి మోకరిల్లడం, భూమిపై అరచేతులు ఆనించి సజ్దా చేయడం, మరికొన్ని నిర్ణీత పదాలను వల్లించడం లాంటి పనులు, కదలికలే ఆరాధన అని

అనుకుంటారు మీరు. అదే విధంగా రమజాన్ నెల మొదటి రోజు లగాయత్తు షవ్వాల్ చంద్రదర్శనం అయ్యేంత వరకు ఉదయం నుండి సాయంకాలం దాకా ఆకలి దప్పులతో ఉండిపోవడాన్నే ఆరాధన అని మీరనుకుంటారు. మీరనుకునేది దివ్యఖుర్ఆన్ నుండి కొన్ని అధ్యాయాలు పారాయణం చేయడమే ఆరాధన. అలాగే మక్కా నగరానికి వెళ్ళి కాబా చుట్టు ప్రదక్షిణ చేయడమే ఆరాధనగా భావిస్తారు మీరు. మొత్తానికి కొన్ని బాహ్యరూపాలను మటుకే ఆరాధనగా భావిస్తారు. ఎవరైనా ఆ బాహ్య రూపాలను అచరిస్తే మీరు దాన్ని ఆరాధన అని, అతడు ఆరాధనను నెరవేర్చాడని "జిన్నుల్ని, మానవుల్ని నా ఆరాధన చేయడానికి తప్ప మరే ఉద్దేశ్యంతో సృజించలేదు" అనే ఖుర్ఆన్ ఆయత్ యొక్క ధ్యేయాన్ని నెరవేర్చాడని, ఇక అతడు తన జీవితంలో ఏ పని చేయడానికైనా సరే సర్వ స్వతంత్రుడు అని అనుకుంటారు.

కాని యదార్థం ఏమిటంటే, అల్లాహ్ మనుషుల్ని, జిన్నుల్ని, ఏ ఆరాధన కోసమైతే సృజించాడో, ఏ ఆదేశం అయితే ఇచ్చాడో అది పూర్తిగా భిన్నమైనది. మీరు మీ జీవితంలోని సర్వకాల సర్వావస్థల్లో దైవచట్టాలకు విధేయులై ఉండడమే ఆరాధన. మీరు దైవశాసనాలకు వ్యతిరేకమైన ప్రతిశాసనం నుండి విముక్తులైపోవాలి. మీ ప్రతి కదలిక, దైవం మీ కోసం ఏర్పరచిన పరిధిలోనే ఉండాలి. మీ ప్రతి పని దైవం మీకు చూపిన విధానాలకే అనుగుణంగా ఉండాలి. ఈ తీరుగా మీరు ఏ జీవితాన్నైతే గడుపుతారో ఆ జీవితం మొత్తం ఆరాధనే. ఇలాంటి జీవితంలో మీరు నిద్రించడం మేల్కొనడం, తినడం, త్రాగడం, మాట్లాడ్డం ఇంకా మీ ప్రతికదలిక కూడా ఆరాధనే. చివరికి మీరు మీ భార్య దగ్గరకు వెళ్ళడం మీ పిల్లవాణ్ణి ముద్దాడ్డం కూడా ఆరాధనే. మీరు ఏ పనులనైతే ప్రాపంచికమైనవి అని అనుకుంటారో అవన్నీ ధార్మికమైన ఆరాధనలే. అయితే మీరు వాటిని నిర్వర్తించడంలో దైవ నియమాలను పాటించాలి. ఇలాగే

మీ జీవితంలోని ప్రతి అడుగు వేసేటప్పుడు దైవం దృష్టిలో ఏది ధర్మ సమ్మత మైనది, ఏది కాదు, ఏది హలాల్, మరేది హరామ్, విధి నిషేధాలేవి? దైవానికి ఇష్టం అయింది ఏది? అయిష్టమైనది ఏది? అనేది సతతం మీ దృష్టిలో ఉంచుకొని నడచుకోవాలి. ఉదాహరణకు మీరు ఉపాధి సంపాదించడానికి బయలుదేరుతారు. ఈ మార్గంలో మీకు దైవంచే నిషేధించబడిన సొత్తు సునాయాసంగా లభ్యం అయ్యే అవకాశాలు ఎన్నో ఎదురౌతూ ఉంటాయి. మీరేగనక దైవభీతి వల్ల ఆ సొత్తును ముట్టుకోకుండా కేవలం ధర్మ సమ్మతమైన ఉపాధిని ఆర్జించి తీసుకొని వస్తే, ఎంత సమయం అయితే దాని కోసం వెచ్చిస్తారో ఇదంతా ఆరాధనే. ఆ ఉపాధిని తెచ్చి మీ భార్యాపిల్లలకు పెట్టి మీరూ తిని దైవంచే నిర్ణయించబడిన హక్కుదార్లకు తినిపిస్తే దీనికి పుణ్యఫలం పొందేందుకు అర్హులయ్యారన్నమాటే. మీరు దారిన నడుస్తూ ఒక రాయిని, ముల్లును ప్రజలకు కష్టం కలక్కుండా తొలగిస్తే ఇది కూడా ఆరాధనే. ఇదే విధంగా ఒక రోగికి సపర్యలు చేస్తే లేక అంధునికి దారిచూపిస్తే లేక ఆపదల్లో చిక్కుకున్న వారికి సహాయపడితే అది కూడా ఆరాధనే. మాట్లాడ్డంలో అసత్యాన్ని, చాడీలను, పరనిందను, పరోక్షనిందను, పరుష వాక్యాలను హృదయాన్ని గాయపరిచే మాటలను ఉపయోగించకుండా జాగ్రత్తపడుతూ దైవానికి భయపడి, సత్యాన్నే పలికితే ఎంత సమయం అయితే మీరు మాట్లాడ్డానికి వెచ్చించారో అదంతా ఆరాధనలోనే గడిచిందన్న మాట.

కాబట్టి దైవారాధన అంటే, ప్రాజ్ఞత వచ్చినప్పటి నుండి చనిపోయేదాకా మీరు దైవంచే నిర్ణయించబడిన చట్టంపైన్నే నడవాలి; ఆయన ఆజ్ఞలకు అనుగుణంగానే జీవితం గడపాలి అన్నదే. ఈ ఆరాధన కోసం ఓ సమయం అంటూ నిర్ణయమైలేదు. ఈ ఆరాధన ఎల్లవేళలా జరగాల్సిందే. దీనికి ఓ రూపం అంటూలేదు. ప్రతి పనిలోనూ, ప్రతి రూపంలోను ఆయన్ను ఆరాధించాల్సిందే.

ఫలానా సమయంలో నేను దైవదాసుణ్ణి, ఫలానా వేళప్పుడు నేను దైవదాసుణ్ణి కాను అని మీరు అనడానికి వీల్లేదు. అదేవిధంగా, ఫలానా సమయం దైవారాధనకు కేటాయించబడింది, ఫలానా సమయం ఆరాధనకు కాదు అని కూడా మీరు అనలేరు.

సోదరులారా! ఆరాధనా భావం ఏమిటో మీకు అర్థమైంది. దానికి తోడు, జీవితంలోని సర్వకాల సర్వావస్థల్లో ఆయనకు విధేయత చూపడమే ఆరాధన అని కూడా మీరు తెలుసుకున్నారు. అయితే మరి ఈ నమాజు, రోజా, హజ్ వగైరాలు ఏమిటి? అని మీరు నన్నడగవచ్చు. ఈ ప్రశ్నలకు సమాధానం ఏమిటంటే, మీపై అల్లాహ్ విధించిన ఈ ఆరాధనలు మిమ్మల్ని, మీ జీవితంలోని సర్వకాల సర్వావస్థల్లో మీరు నిర్వర్తించవలసి ఉన్న ఆరాధన కోసం సమాయత్త పర్చడానికే. నమాజు మిమ్మల్ని రోజుకు అయిదుసార్లు, మీరు అల్లాహ్ దాసులని, మీరు ఆయన దాస్యమే చేయాలని గుర్తు చేస్తోంది. రోజా సంవత్స రానికి ఒకసారి పూర్తి ఒక్క నెల వరకు మిమ్మల్ని ఆయన దాస్యం కొరకు సమాయత్తపరుస్తుంది. జకాత్ మాటిమాటికి మిమ్మల్ని, మీరు సంపాదించిన ఈ ధనం దైవదత్తమైన సొత్తు, దాన్ని కేవలం మీరు మీ మనోవాంఛల పరిపూర్తి కోసమే వెచ్చించవద్దు, మీ స్వామి యొక్క హక్కుల్ని నెరవేర్చమంటుంది. హజ్ అనేది మీ హృదయంపై దైవ ప్రేమ, ఆయన ఔన్నత్యపు చెరగిపోని ముద్రను వేస్తుంది. ఒకసారి హృదయంపై పడ్డ ఆ ముద్ర యావజ్జీవితం ఇక చెరిగిపో జాలదు. ఈ ఆరాధనలన్నిటిని నెరవేర్చిన తరువాత ఒకవేళ మీరు, మీ జీవితం అంతా దైవారాధనగా చేసుకున్న వారైతే, అప్పుడు నిస్సందేహంగా మీ నమాజు నమాజే, మీ రోజా రోజాయే, మీ జకాతు జకాతే, మీరు చేసే హజ్ కూడా హజ్‌యే. అయితే ఈ ధ్యేయం పూర్తికాకపోతే మాత్రం, రుకూ సజ్దాలు చేయడం, ఆకలి దప్పుల్తో రోజాలు గడపడం, హజ్‌కు సంబంధించిన నియమాల

నన్నిటిని నెరవేర్చడం మరియు జకాత్ డబ్బును పంచిపెట్టడంతో ఒరిగేదేమీ లేదు. ఈ బాహ్యపరమైన ఆరాధనా విధానాలన్నీ ఓ శరీరంలాంటివి, శరీరంలో ప్రాణం ఉంటే అది కదుల్తుంది, నడుస్తుంది, పని చేస్తుంది. అప్పుడు దాన్ని ఓ ప్రాణం ఉన్న మనిషిగా గుర్తిస్తాం. కాని ఆ శరీరంలో ప్రాణమే లేకపోతే అది ఓ శవం. శవానికి కాళ్ళూ చేతులు, కళ్ళు ముక్కు అన్నీ ఉంటాయి. అందులో ప్రాణం లేదు కాబట్టి మీరు దాన్ని మట్టిలో పాతిపెట్టేస్తారు. ఇలాగే నమాజులోని అంశాలన్నీ సక్రమంగా నెరవేర్చబడినా, రోజాల షరతులన్నీ పూర్తి అయినా, నమాజ్, రోజాలకు ముఖ్య ఉద్దేశ్యాలైన దైవభీతిగాని, ఆయన ప్రేమగాని, భక్తి, విధేయతలుగాని జనించకపోతే అవి కూడా ప్రాణం లేనివే.

మునుముందు రాబోయే ప్రసంగాల్లో, ఏ ఆరాధనలైతే విధిగా నిర్ణయించబడ్డాయో, వాటిలో ప్రతిదీ ఆ పెద్ద ఆరాధన కోసం మనిషిని ఎలా సమాయత్తపరుస్తుందో వివరంగా తెలియచెబుతాను. ఒకవేళ ఆ ఆరాధనల్ని అర్థం చేసుకొని నెరవేరిస్తే, వాటి అసలు ధ్యేయాన్ని నెరవేర్చడానికి ప్రయత్నిస్తే అవి మీ జీవితాన్ని ఎలా మారుస్తాయో చెబుతాను.

★ ★ ★

# నమాజ్

సోదరులారా! గత ప్రసంగంలో నేను మీముందు ఆరాధనకు సంబంధించిన అసలు భావం ఏమిటో వివరించాను. మనుషులు, జిన్నులు ఏ ఆరాధన కోసం అయితే సృజించబడ్డారో, ఆ అసలైన ఆరాధన కోసం ఇస్లాంలో విధించబడిన ఆరాధనలు మనలను ఎలా సమాయత్త పరుస్తాయో వివరిస్తాను అని మాట కూడా ఇచ్చాను. వీటిలో అన్నిటికంటే ముఖ్యమైన ఆరాధన “నమాజ్”. నేటి ఈ ప్రసంగంలో కేవలం దాని గురించే మీకు వివరించదలిచాను.

ఆరాధన అంటే కేవలం దాస్యమే అనేది మీకు తెలిసిన విషయమే. మీరు దేవుని దాసులుగానే జన్మించినపుడు, ఎప్పుడూ ఏ పరిస్థితిలోను ఆయన దాస్యం నుండి విముక్తులు కాలేరు. ఇన్ని గంటలు లేక ఇన్ని నిమిషాలు దేవుని దాసుణ్ణి తక్కిన సమయంలో ఆయన దాసుణ్ణికాను అని అనలేనప్పుడు మీరు, ఇంత సమయం మట్టుకే నేను దైవాన్ని ఆరాధిస్తాను తక్కిన సమయంలో నా ఇష్టం వచ్చినట్లు నడుచుకునే స్వేచ్ఛ నాకుంది అని అనలేరు కూడా. మీరు పుట్టుకతోనే దైవానికి దాసులు. ఆయన మిమ్మల్ని ఆయన దాస్యం కోసమే పుట్టించాడు. కాబట్టి మీ జీవితం అంతా ఆయన ఆరాధనలోనే గడపాలి. ఎప్పుడూ ఒక్క క్షణం కోసమైనా మీరు ఆయన దాస్యం నుండి ప్రమత్తంగా ఉండకూడదు.

ఇదే కాకుండా, ఆరాధన అంటే ప్రాపంచిక కార్యకలాపాలను వదిలేసి ఓ మూలన కూర్చొని అల్లాహ్ పేరు జపించడం కాదని, ఆరాధన అంటే ఈ లోకంలో మీరేం జేసినా దైవాదేశాలకు కట్టుబడి నడుచుకోవడం అని కూడా చెప్పాను. మీరు నిద్రించడం, మేల్కోవడం, తినడం, త్రాగడం ప్రతి కదలిక

అంతా దైవ చట్టానికి లోబడి ఉండాలి. మీరు మీ ఇండ్లలో మీ భార్యా పిల్లలతో, అక్కా, చెల్లెళ్ళు, అన్నాదమ్ములతో బంధుమిత్రులతో కాలం గడిపేటప్పుడు, వాళ్ళ ఎడల దైవాదేశాలకనుగుణంగానే మెలగాలి. మీరు మీ స్నేహితులతో మాట్లాడేటప్పుడు కూడా మీరు దైవదాస్యం నుండి విముక్తులుగా లేరని గమనించాలి. మీరు మీ ఉపాధిని సంపాదించడానికి బయటకు వెళ్ళినప్పుడు, ప్రజల్తో వ్యాపార వ్యవహారాలు చేసేటప్పుడు దైవం నిర్ణయించిన హద్దుల్ని దాటకుండా ఉండాలన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి. మీరు రాత్రి పూట చీకటిలో ఏ పాపకార్యం అయినా ఎవ్వరూ చూడకుండా చేయగలరు. ఆ సమయంలో కూడా దేవుడు మిమ్మల్ని చూస్తున్నాడు, భయపడేది ప్రపంచానికి కాదు, దైవానికి అన్నది మీరు గుర్తుంచుకోవాలి. అడవిలో మీరు ఒంటరిగా ప్రయాణం చేస్తున్నప్పుడు ఏ సాక్ష్యాధారాలు లేకుండా, ఏ పోలీసుకు కనబడకుండా నేరం చేయగలరు. ఆ సమయంలో కూడా మీరు దైవాన్ని తలచుకొని భయపడి ఆ నేరం జోలికి పోకుండా ఉండాలి. మీరు అసత్యం పలికి, అన్యాయం చేసి, అత్యాచారానికి పాల్పడి బోలెడు లాభాన్ని ఆర్జించగలరు. దాన్నుండి మిమ్మల్ని ఆపేవాడెవడూ ఉండడు. అలాంటప్పుడు కూడా మీరు దైవానికి భయపడి ఆయన అసంతుష్టుడౌతాడు అనే భావంతో ఆ లాభాన్ని వదిలేయాలి. సత్యం, న్యాయం ద్వారా మీకు నష్టం వాటిల్లుతోంది. అయినా దైవం మీ ఈ చర్యకు సంతోషిస్తాడని ఆ నష్టాన్ని భరించడానికే సిద్ధపడాలి. అదే ఆరాధన. మొత్తానికి ప్రపంచాన్ని వదిలివేసి మూలల్లో కూర్చుని జపమాలలు త్రిప్పడం మాత్రమే ఆరాధన కాదు. ప్రాపంచిక వ్యాపకాల్లో చిక్కుకుని కూడా దైవచట్టాన్ని అనుసరించడమే ఆరాధన. దైవ స్మరణ అంటే నోరారకుండా ఆయన నామాన్ని స్మరించడం, జపించడం మాత్రమే కాదు. ప్రాపంచిక చిక్కుల్లో చిక్కుకొని ఉన్నప్పుడు అన్నివేళలా మీకు దైవం గుర్తుకురావడమే అసలైన దైవస్మరణ. ఏ వ్యాపకాలైతే దైవాన్ని విస్మరింపజేస్తాయో వాటిలో లీనమై ఉంటూనే దైవాన్ని

విస్మరించకుండా ఉండాలి. ప్రాపంచిక జీవితంలో దైవచట్టాలను ఉల్లంఘించే అనేక అవకాశాలు, గొప్ప లాభాల్ని పొందే ఎన్నో ఆశలు, నష్టాల భయాలు ఉంటాయి. అలాంటి చోటే దైవాన్ని స్మరించి ఆయన ఆదేశాలను అనుసరించాల్సి ఉంటుంది. ఇదే దైవ స్మరణ. ఈ దైవస్మరణ గురించి దివ్య ఖుర్‌ఆన్‌లో ఇలా సూచించబడింది:

> *నమాజు ముగిసిన తరువాత భూమి పై వ్యాపించండి, అల్లాహ్ అనుగ్రహాన్ని అన్వేషించండి; అల్లాహ్‌ను అత్యధికంగా స్మరిస్తూ ఉండండి, బహుశా మీకు సాఫల్య భాగ్యం కలుగవచ్చు. (అల్ జుముఅహ్:10)*

ఈ ఆరాధనా భావాన్ని మననం చేసుకుంటూ, ఇంత గొప్ప ఆరాధనను నెరవేర్చడానికి కావలసిందేమిటి? మనిషిలో ఈ సద్గుణాలను నమాజు ఎలా సృజిస్తుంది అనేది ఆలోచించండి.

ప్రప్రథమంగా మీకు అవసరమైన అంశం ఏమిటంటే మీరు దైవదాసులని, ప్రతి విషయంలోను, ప్రతి సందర్భంలోను మీరు ఆయన దాస్యాన్నే చేయాలని మాటిమాటికీ గుర్తుచేస్తూ ఉండాలి. ఇలా ఎందుకు గుర్తు చేయవలసి వచ్చిం దంటే ఓ షైతాను మనిషి హృదయంలో తిష్ఠవేసి ఉన్నాడు. అతడు మిమ్మల్ని సతతం, నీవు నాకు దాసుడవు అని అంటాడు. అదే విధంగా లక్షలాది కోట్లాది షైతానులు మనచుట్టూ ఉన్న ప్రపంచంలో వ్యాపించి ఉన్నారు. వాళ్ళలో ప్రతివాడు నీవు నాకు దాసుడవు అని అంటాడు. మనిషిని రోజుకు ఎన్నోమార్లు నీవు ఎవరి దాసుడవు కావు కేవలం దైవానికే దాసుడవు అని గుర్తు చేయకపోతే ఈ షైతానుల మాయాజాలం పటాపంచలు కాజాలదు. ఈ పనిని చేసేదే నమాజు. ఉదయం లేవగానే అన్ని పనులకంటే ముందు అది మీకు గుర్తు చేసేది ఈ విషయాన్నే. ఆ తరువాత మీరు మీ పనుల్లో లీనమైనప్పుడు తిరిగి మూడుసార్లు ఈ విషయాన్నే గుర్తు చేస్తుంది. ఆ తరువాత మీరు నిద్రించడానికి

ఉపక్రమించినప్పుడు చివరిసారిగా దాన్ని తిరిగి గుర్తు చేస్తుంది. ఇది నమాజు యొక్క మొదటి ప్రయోజనం. ఇందుకోసమే ఖుర్‌ఆన్‌లో నమాజును 'జిక్ర్ (సంస్మరణ)గా చెప్పడం జరిగింది. అంటే దైవాన్ని స్మరించడం అని.

ఆ తరువాత, మీరు ఈ జీవితంలో అడుగడుగునా దైవాదేశాలను శిరసావహించడానికి, మీ విధి ఏమిటో గుర్తించి తద్వారా మీరు దాన్ని అప్రమత్తంగా నిర్వహించడానికి కావలసిన గుణగణాలు మీకు అబ్బడం కూడా అవసరమే. విధి అంటే ఏమిటో తెలియని వ్యక్తి ఆజ్ఞాపాలన ఎలా చేయగలడు? అదే విధంగా ఒకరికి విధి అంటే ఏమిటో తెలిసినా అతడు విధిని విధిగా తలచి దాన్ని నిర్వహించడానికి శ్రద్ధ వహించేటంత శిక్షణ కూడా లేకపోతే రేయింబవళ్ళలోని ఇరవై నాల్గు గంటల్లో ఏ వేలాది ఆదేశాలైతే అతనికి ఇవ్వబడతాయో వాటిని శ్రద్ధగా ఎలా నిర్వర్తించగలడు?

సైన్యం లేక పోలీసు శాఖలో ఉద్యోగం చేసే అవకాశం ఎవరికైతే లభించిందో వాళ్ళకు ఈ రెండు రకాల ఉద్యోగాల్లో డ్యూటీని అర్థం చేసుకోవడానికి, దాన్ని నిర్వర్తించడానికి ఎలాంటి శిక్షణ ఇవ్వబడుతుందో బాగా తెలిసే ఉంటుంది. రేయింబవళ్ళలో ఎన్నోమార్లు 'బిగిల్' ఊదబడుతుంది. సిపాయిలందరిని ఒకేచోట హాజరు అయ్యే ఆదేశం ఇవ్వబడుతుంది. వారితో పరేడు చేయించబడుతుంది. ఇదంతా వారికి ఆజ్ఞాపాలన అంటే ఏమిటో తెలియజేయడానికి చేసే తర్ఫీదు. వారిలో ఎవరైతే సోమరిపోతులుగా, అయోగ్యులుగా వ్యవహరించి 'బిగిల్' శబ్దాన్ని విని కూడా తమ ఇంటనే కూర్చొని ఉంటాడో మరెవరైతే 'పరేడు' ఆదేశాల మేరకు కదలడో వారిని ముందే పనికిమాలినవారుగా గుర్తించి ఉద్యోగం నుండి తొలగిస్తారు. ఇదే విధంగా నమాజు కూడా రోజుకు అయిదుసార్లు బిగిల్ ఊదుతుంది. దాన్ని విని అన్ని వైపుల నుండి, అల్లాహ్ ఆజ్ఞలను శిరసావహించడానికి మేము సిద్ధం అంటూ అల్లాహ్ సిపాయీలైన ముస్లిములు పరుగెత్తుకుంటూ రావాలి. కాని

ఏ ముస్లిమైతే ఆ బిగిల్‌ను విని ఇంటనే ఉండిపోతాడో, తన స్థానం నుండి ఏమాత్రం కూడా కదలడో తాను విధి అంటే ఏమిటో గుర్తించనివాడని, గుర్తించినా తాను దైవ సైన్యంలో ఉండతగినవాడు కానని, సోమరిపోతునని, పనికిమాలిన వాడినని నిరూపించుకుంటున్నాడు.

ఈ కారణంగానే దైవప్రవక్త (సఅసం), *"ఎవరైతే అజాన్ పిలుపు విని కూడా తమ ఇండ్ల నుండి బయటకు రారో, వారి ఇళ్ళకు వెళ్ళి వాటిని తగలబెట్టాలనిపిస్తుంది."* అని అన్నారు. ఈ కారణంగానే మరో హదీసులో నమాజును 'కుఫ్ర్' (తిరస్కారం) మరియు 'ఇస్లామ్'ల మధ్య గీటురాయిగా చెప్పడం జరిగింది. ప్రవక్త (సఅసం) గారి కాలంలోను, ఆ తరువాత ఆయన సహచర వర్గం వారి కాలంలోను నమాజు కోసం 'జమాఅత్' (సామూహిక నమాజు)లో చేరని వారిని ముస్లింగా పరిగణించేవారు కాదు. చివరికి, మునాఫిక్‌లు (కపట ముస్లిములు) కూడా తమను ముస్లిములుగా ప్రదర్శించడానికి జమాఅత్‌లో చేరి నమాజు చేసేవారు. కాబట్టి దివ్య ఖుర్‌ఆన్‌లో మునాఫిక్‌లను అభిశంసిస్తూ *"వారు నమాజు కోసం నిలబడినప్పుడు అలసత్వంతో నిలబడతారు"* అని చెప్పడం జరిగింది. అంటే వారిని అభిశంసించింది వారు నమాజు చేయనందుకు కాదు, వాళ్ళు ఎంతో అయిష్టంగా నమాజు కోసంవస్తారనే.

దీని ద్వారా తెలిసేదేమిటంటే నమాజు చేయని వ్యక్తిని ముస్లిమ్‌గా భావించడానికి వీల్లేదు. ఎందుకంటే ఇస్లామ్ కేవలం ఓ విశ్వాసమే కాదు, అది పూర్తి క్రియాశీలకమైన ధర్మం కూడా. ఇంకా జీవితంలో ప్రతిక్షణం ఓ ముస్లిమ్ ఇస్లామ్‌ను ఆచరిస్తూ తిరస్కారంతో, పాపాలతో సంఘర్షించవలసి ఉంటుంది. ఇలాంటి గొప్ప క్రియాశీల జీవితం కోసం ప్రతిముస్లిమ్ దైవాజ్ఞలను శిరసావహించేందుకు అనుక్షణం సిద్ధంగాఉండాలి. ఏ వ్యక్తిలోనైతే ఇలాంటి సంసిద్ధత కరువైపోతుందో ఆ వ్యక్తి ఇస్లామ్‌కు పనికిరానివాడే. అందుకనే, ఎవరైతే తాము

ముస్లిములమని చెప్పుకుంటారో వారిని మాటిమాటికి, వారు నిజంగా ముస్లిములేనా కాదా? వారు నిజంగా తమ జీవితంలో దైవాదేశాలను శిరసా వహించేందుకు సిద్ధంగా ఉన్నారా అని పరీక్షించడానికే రోజుకు అయిదు వేళలా నమాజు ఫర్జు (విధిగా) చేయబడింది. ఒకవేళ అతడు దైవపరేడు (శిక్షణ)కు సంబంధించిన బిగిల్ విని ఏమాత్రం కదలకపోతే అతడు ఇస్లామ్ యొక్క క్రియా జీవితంకోసం సిద్ధంగా లేడన్నది స్పష్టమవుతుంది. ఆ తరువాత అలాంటి వారు దైవాన్ని విశ్వసించడం, దైవ ప్రవక్తను విశ్వసించడం అన్నది అర్ధరహితం. అందుకే ఖుర్‌ఆన్‌లో ఇలా సెలవియ్యడం జరిగింది.

"*ఎవరైతే దైవ విధేయతకు, దాస్యానికి సిద్ధంగా ఉంఢరో కేవలం వారికే నమాజు కష్టతరమైనదిగా కనబడుతుంది.*" నమాజు ఎవరికి కష్టమైనదిగా తోచితే అతడు దైవ విధేయతకు, ఆయన దాస్యానికి సిద్ధంగా లేడు అన్నది రుజువైనట్లే.

మూడో అంశం దైవభీతి. ఇది సతతం హృదయంలో తాజాగా ఉండాలి. దైవం ఎల్లవేళలా, ప్రతిచోటా అతణ్ణి చూస్తున్నాడు, అతని ప్రతి కదలిక దైవానికి తెలుసు, దైవం చీకట్లోను అతణ్ణి చూడగలడు, తాను ఒంటరిగా వున్నవేళ కూడా దైవం తోడున్నాడు. ప్రపంచం మొత్తానికి తప్పించుకోవడం సాధ్యమే కాని, దైవ దృష్టి నుండి తప్పించుకోవడం అసాధ్యం. ప్రాపంచిక శిక్షల నుండి మనిషి తప్పించుకోగలడు కాని దైవశిక్ష నుండి తప్పించుకోవడం అసంభవం అనే విశ్వాసం ప్రతి ముస్లిముకు ఉన్నప్పుడు తప్ప అతడు ఇస్లామ్‌ను అనుసరించలేడు. ఈ విశ్వాసమే ముస్లిముని దైవాదేశాల ఉల్లంఘన నుండి వారిస్తుంది. ఈ విశ్వాసబలం వల్లనే అతడు, జీవితంలో దైవం నిర్ధారించిన ధర్మసమ్మతాలు (హలాల్) నిషిద్ధాలు (హరాం) అనే హద్దులకు లోబడి ఉండగలడు. ఈ విశ్వాసబలమే బలహీనపడితే ముస్లిమ్ నిజంగా ముస్లిముగా జీవితం గడపలేడు. అందుకే అల్లాహ్ అతని విశ్వాసాన్ని అతని

హృదయంలో మాటిమాటికి తాజా పరచడానికి, ఆ విశ్వాసానికి బలం చేకూర్చడానికి రోజుకు అయిదు పూటల నమాజు ఫర్జ్ చేశాడు. కాబట్టి దివ్య గ్రంథంలో ఈ నమాజు ప్రయోజనాన్ని అల్లాహ్ ఈ విధంగా సెలవిచ్చాడు:

"నిస్సందేహంగా నమాజ్ మనిషిని చెడుల నుండి, అశ్లీల కార్యాల నుండి ఆపుతుంది." దీనికి కారణం ఏమిటో మీరే ఆలోచించి అర్థం చేసుకోగలరు. ఉదాహరణకు, మీరు నమాజు కోసం శుచిగా శుభ్రంగా 'వుజూ' చేసి వస్తారు. మీరు అపరిశుద్ధులై గుస్ల్ చేయకుండా వస్తే లేక మీ వస్త్రాలు అపరిశుద్ధంగా ఉండి వాటినే మీరు వేసుకొని వస్తే లేక మీరు వుజూ చేయవలసి ఉన్నా నేను వుజూ చేసే వచ్చాను అని అంటే మిమ్మల్ని ఎవరు కాదనగలరు? కాని మీరు అలా చేయరు. ఎందుకు? దైవం ఎదుట ఈ పాపం దాగదని మీకు తెలుసు కాబట్టి. ఇలాగే నమాజులో ఏవైతే మెల్లిగా పఠించబడతాయో వాటిని మీరు పఠించకపోయినా ఇతరులెవ్వరికీ తెలియదు. కాని మీరు అలా చేయరు. ఎందుకంటే దైవం అన్నీ వింటున్నాడని, ఆయన మీ బృహద్ధమని కన్నా సమీపంగా ఉన్నాడని మీకు విశ్వాసం ఉంది గనక. ఇదే విధంగా మీరు అడవి లోనూ నమాజు చేస్తారు. రాత్రిపూట చీకట్లోను మీరు నమాజు చేస్తారు. మీరు మీ ఇంట్లో వంటరిగా ఉన్నప్పుడు కూడా నమాజు చేస్తారు. వాస్తవంగా మిమ్మల్ని గమనించే వాళ్ళే ఉండరు.

మీరు నమాజు చెయ్యలేదు అనే విషయం మరెవ్వరికీ తెలియదు కూడా. కారణం ఏమిటి? మీరు కనబడకుండానైనా సరే దైవాజ్ఞను ఉల్లంఘించడానికి భయపడతారు, దైవం ఎదుట ఏ నేరాన్నైనా దాచడం అసాధ్యమని మీరు నమ్ముతారు కాబట్టి. ఇలా నమాజు ఎలా దైవభీతిని నేర్పుతుందో, ఆయన అంతటా ఉన్నాడు, అన్నీ వింటాడు, అంతా చూస్తాడు అన్న విశ్వాసాన్ని ఎలా హృదయంలో నాటుతుందో మీరు ఊహించుకోవచ్చు. రేయింబవళ్ళ ఇరవైనాల్గు గంటల్లో, ఈ దైవభీతి, ఈ విశ్వాసం తాజాగా ఉండకపోతే మీరు

అన్ని వేళలా దైవారాధన, ఆయన దాస్యాన్ని ఎలా చేయగలుగుతారు? ఒకవేళ ఈ భావనే మీ హృదయంలో నాటుకోకపోతే, రేయింబవళ్ళు మీకు తారసపడే వేలాది వ్యవహారాల్లో దైవానికి భయపడి, సన్మార్గం మీద నిలకడగా ఉండి పాపాలకు దూరంగా ఉండడం ఎలా సాధ్యపడుతుంది?

దైవారాధన కోసం అత్యంతావసరమైన అంశం మీరు దైవ చట్టాన్ని తెలుసుకొని ఉండడం. ఆ చట్టం గురించిన జ్ఞానం ఏమిటో మీకు లేనప్పుడు, అది మీకు తెలియనప్పుడు దాన్ని అనుసరించేదెలా? ఈ పని కూడా నమాజే నిర్వహిస్తోంది. నమాజులో ఖుర్‌ఆన్ పారాయణం చేయబడేది ప్రతి రోజు దైవాదేశాలను, ఆయన ఆజ్ఞల్ని మీరు తెలుసుకుంటూ ఉండడానికే. జుమా ప్రసంగం కూడా మీకు ఇస్లామీయ బోధనల గురించి తెలియజెప్పడానికే. సామూహిక నమాజు (జమాఅత్ పాటు నమాజ్), జుమా ద్వారా కలిగే ప్రయోజనం ఏమిటంటే పండితులు పామరులు అనేకమార్లు ఓ చోట చేరే అవకాశం లభిస్తూ ఉంటుంది. తద్వారా ప్రజలు దేవుని ఆదేశాలను కూడా తెలుసుకునే అవకాశం లభిస్తుంది. నమాజులో మీరు ఏదైతే పఠిస్తారో దాని గురించి అవగాహన చేసుకోకపోవడం మీ దురదృష్టం. ఇదే కాకుండా మీకు వినిపించబడే జుమా ప్రసంగాల ద్వారా కూడా ఇస్లామీయ విజ్ఞానం అబ్బడం లేదు మీకు. సామూహిక నమాజుల్లో చేరే మీ ధార్మిక పండితులు తమ పామర సోదరులకు ఎలాంటి బోధచేయడం లేదు. ఇదే విధంగా పామరులు తమ సోదరుల్ని అడిగైనా తెలుసుకోరు. నమాజు ఈ ప్రయోజనాలను పొందడానికి అవకాశాలు కల్పిస్తూ ఉంది. కాని మీరే ఆ ప్రయోజనాలను పొందకపోతే నమాజును తప్పు పట్టి ఏం లాభం?

అయిదో అంశం - ప్రతిముస్లిమ్ తన జీవిత కార్యకలాపాల్లో ఒంటరిగా ఉండకుండా, ముస్లిములతో కలసి జమాఅత్‌గా ఏర్పడి దైవారాధన చేయాలి.

అంటే ఆ దైవం యొక్క ఆదేశాలను పాటిస్తూ, ఆయన చట్టాలపై అమలు చేస్తూ ఆయన చట్టాన్ని ప్రపంచంలో నడిపించడానికి ఒకరికొకరు సహాయపడాలి. ఈ జీవితంలో ఓ వైపు ముస్లిములు అంటే దైవానికి విధేయులైన వారు, మరోవైపు దైవతిరస్కారులు అంటే దైవంపై తిరగుబాటు చేసేవాళ్ళు ఉన్న విషయం మీకు తెలిసిందే. విధేయత మరియు తిరుగుబాటు మధ్య రేయింబవళ్ళు సంఘర్షణ సాగుతోంది. తిరుగుబాటుదారులు దైవచట్టాల్ని ఉల్లంఘిస్తూ ఉంటారు. ఆయన ఆదేశాలకు భిన్నంగా ప్రపంచంలో షైతాను చట్టాలను జారీ చేస్తారు, వారికి వ్యతిరేకంగా ఒక్కొక్క ముస్లిమ్ ఒంటరిగా వారిని ఎదిరించి విజయాన్ని పొందలేడు. కాబట్టి దైవ విధేయులైన దాసులంతా కలిసి సామూహిక శక్తితో ఆ తిరుగుబాటును అడ్డుకుని దైవ శాసనాల్ని అమలు పరచాలి. ఈ బలమైన సామూహిక శక్తిని పుట్టించేది నమాజ్. అయిదు పూటల నమాజు, ఆ తరువాత జుమాకు సంబంధించిన గొప్ప సమావేశం ఇవన్నీ కలసి ముస్లిములందరిని ఓ దృఢమైన గోడలా తయారు చేస్తాయి. దైనందిన క్రియాశీలక జీవితంలో ముస్లిములను పరస్పరం ఒకరినొకరు అండగా నిలవడానికి అవసరమైన సమైక్యతను, శక్తి సామర్థ్యాలను జనింపజేయడానికి ఇవి దోహదపడతాయి.

★ ★ ★

# నమాజులో మీరు పఠించేదేమిటి?

ముస్లిం సోదరులారా! గత ప్రసంగంలో, నమాజు మనిషిని, ఇబాదత్ అంటే దాస్యం మరియు విధేయత కోసం ఎలా సిద్ధపరుస్తుందో తెలియజేశాను. ఈ సందర్భంగా నేను చెప్పిన విషయాల ద్వారా మీరు ఓ విషయాన్ని గుర్తించే ఉంటారు. ఎవరైతే నమాజును కేవలం ఫర్జ్ (విధి)గా మరియు దైవాజ్ఞగా భావించి ఎడ తప్పకుండా ఆచరిస్తూ ఉంటాడో అతడు తన నమాజులో పఠించే దుఆలను అర్థం చేసుకోకపోయినా అతనిలో దైవభీతి, దైవం అంతటా ఉన్నాడు, అన్నీ చూస్తున్నాడు అన్న విశ్వాసం, ఆయన న్యాయస్థానంలో ఒకరోజున హాజరుకావలసివుందన్న నమ్మకం ఎల్లప్పుడూ తాజాగానే ఉంటుంది. అతని మనస్సులో సతతం "నేను దైవదాసుణ్ణి తప్ప మరెవ్వరి దాసుణ్ణికాను, దైవమే నా అసలైన ప్రభువు, స్వామీ, పాలకుడు" అనే నమ్మకం సజీవంగా ఉంటుంది. అతనిలో విధి నిర్వహణ భావం, దైవాజ్ఞను పాలించే చురుకుదనం ఉద్భవిస్తుంది. మనిషి జీవితాన్ని దైవదాస్యం, ఆరాధనల కోసం మలిచే గుణగణాలన్నీ తమంతట తామే అతనిలో పుట్టుకొస్తాయి.

ఒకవేళ ఈ నమాజును అర్థం చేసుకుంటూ చేస్తూ ఉంటే మనిషి ఆలోచనలు, అలవాట్లపై, అతని ప్రవర్తనపై ఎంత బలమైన ప్రభావం పడగలదో, అతని విశ్వాస శక్తి ఎలా వృద్ధి అవుతుందో, అతని జీవితం ఎలా మారిపోతుందో నేనిప్పుడు చెప్పదలచాను.

ముందుగా అజాన్‌నే తీసుకుందాం. రోజుకు అయిదు పూటలా మిమ్మల్ని ఈ విధంగా పిలవడం జరుగుతోంది.

అల్లాహు అక్బర్ అల్లాహు అక్బర్

అల్లాహ్‌యే గొప్పవాడు - అల్లాహ్‌యే గొప్పవాడు.

అష్హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహ్
దైవం తప్ప మరో ఆరాధ్యుడు, దాస్యానికి అర్హుడూ మరొకడు లేడని నేను సాక్ష్యమిస్తున్నాను.

అష్హదు అన్న ముహమ్మదర్ రసూలుల్లాహ్
ముహమ్మద్ (సఅసం) అల్లాహ్ ప్రవక్త అని నేను సాక్ష్యం పలుకుతున్నాను.

హయ్యా అలస్సలాహ్
రండి నమాజు కోసం

హయ్యా అలల్ ఫలాహ్
సాఫల్యత వైపునకు రండి

అల్లాహు అక్బర్ అల్లాహు అక్బర్
అల్లాహ్‌యే గొప్పవాడు, అల్లాహ్‌యే గొప్పవాడు.

లా ఇలాహ ఇల్లల్లాహ్
అల్లాహ్ తప్ప వేరే ఆరాధ్యుడు లేడు.

చూశారా! ఇదెంత గొప్ప పిలుపో? ప్రతిరోజు అయిదు పూటలా ఈ పిలుపు మిమ్మల్ని "ఈ భూమిలో ఎవరైతే మేమే గొప్పవాళ్ళమని చెప్పుకుంటూ ఉంటారో వారంతా అసత్యవాదులు, భూమ్యాకాశాల్లో కేవలం ఒకే ఒక శక్తి అందరికన్నా గొప్పది, ఆరాధనకు దానికే అర్హతకలదు. రండి ఆయన్నే ఆరాధించండి, ఆయన ఆరాధనలోనే మీకు ఇహపరలోక సాఫల్యం ఉంది"అని గుర్తు చేస్తుంది. ఈ పిలుపును విని చలించందెవరూ? ఎవరి హృదయంలోనైతే విశ్వాసం ఉందో అతడు ఇంత గొప్ప సాక్ష్యాన్ని, ఇంత బలమైన పిలుపును వినికూడా ఎలా చలించకుండా ఉండగలడు? తన ప్రభువు ఎదుట తలవంచడానికి ఎందుకు పరుగెత్తడు.

ఈ పిలుపును విన్నతోడనే మీరు లేచి నిలబడతారు. మొట్టమొదట మీరు, ' నేను శుచీ, శుభ్రత కలిగి ఉన్నానా? నా వస్త్రాలు అశుభ్రాలుగా లేవు కదా! నాకు వుజూ ఉందా' అన్న విషయాల్ని తరచి చూసుకుంటారు. అంటే మీకు, సర్వలోక ప్రభువు అయిన సర్వేశ్వరుని సన్నిధిలో హాజరయ్యే విషయం, ఈ ఇహలోక సంబంధమైన ఇతర వ్యవహారాల కంటే భిన్నమైంది అన్నది మీకు తెలుసు. ఇతర పనులు ఎలావున్నా ఇక్కడ మాత్రం శరీరం, వస్త్రాలు పరిశుభ్రంగా వుండాలి. ఇంకా వుజూ లేకుండా హాజరవడం గొప్ప అపచారం. ఈ భావన కలిగి ఉన్న మీరు మీ శుచీ, శుభ్రత గురించి బాగా సంతృప్తి పడి ఆ తరువాత 'వుజూ' చేయనారంభిస్తారు. ఈ వుజూ చేసేటప్పుడు మీరు మీకాళ్ళూ చేతులు మొదలైన శరీర అవయవాలను కడుక్కోవడంతోపాటు దైవ స్మరణ (జిక్ర్) కూడా చేస్తూ ఉంటారు. వుజూ పూర్తి చేసుకొని దైవప్రవక్త (సఅసం) నేర్పిన దుఆను కూడా పఠిస్తే మీ శరీరావయవాలకు తోడు మీ హృదయం కూడా పరిశుద్ధమవుతుంది. ఆ దుఆలోని పదాలు ఇవి:

> *"అష్హదుఅల్లా ఇలాహ ఇల్లల్లాహు వహ్దహూ లాషరీక లహూ అష్హదు అన్న ముహమ్మదన్ అబ్దుహూ వ రసూలుహ్. అల్లాహుమ్మజ్ అల్నీ మినత్తవ్వాబీన వజ్ అల్నీ మినల్ ముతహ్హి రీన్."*
>
> *ఏకేశ్వరుడై ఎలాంటి భాగస్వామి లేనటువంటి దైవం తప్ప మరే దేవుడు లేడని నేను సాక్ష్యం ఇస్తున్నాను. అదే విధంగా ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) అల్లాహ్ యొక్క దాసులని, ఆయన ప్రవక్త అని సాక్ష్యం ఇస్తున్నాను. ఓ అల్లాహ్! నన్ను తౌబా చేసే (నీవైపు మరలే) వారిలో చేర్చు. నన్ను పవిత్రతను అవలంబించే వానిగా చెయ్యి.*

ఆ తరువాత మీరు నమాజుకు నిలబడతారు. మా ముఖం ఖిబ్లా వైపు ఉంటుంది. శుచిగా శుభ్రంగా తయారై సర్వలోక ప్రభువు దర్బారులో హాజరయ్యారు. అప్పుడు మీనోట వెలువడే పలుకు అల్లాహుఅక్బర్. అంటే

అల్లాహ్‌యే గొప్పవాడు. ఈ మహోన్నత యదార్థాన్ని నోటితో పలుకుతూ మీరు మీ రెండు చేతుల్ని చెవుల దాకా పైకి ఎత్తుతారు. అంటే ఈ ప్రపంచం, ఇందులో వున్న వాటినన్నింటినీ త్యజించేస్తున్నారన్నమాట. ఆ తరువాత రెండు చేతులు కట్టుకుంటారు. అంటే మీరిప్పుడు మీ ప్రభువు ఎదుట చేతులు కట్టుకొని ఎంతో వినయంతో నిలుచున్నారన్నమాట. ఇలా నిలుచొని మీరేం విన్నవించుకుంటారు?

*"సుబ్హా నకల్లాహుమ్మ వ బిహమ్‌దిక వతబారకస్ముక వతఆల జద్దుక వలా ఇలాహ గైరుక్."*

ఓ అల్లాహ్ నీ స్తోత్రం చేస్తూ నీ పవిత్రతనే కొనియాడుతాను. నీ నామం యెంతో శుభదాయకం. ఎంతో ఉన్నతమైనదీను. నీవు తప్ప ఆరాధ్యుడు ఎవ్వడూలేడు.

*"అవూజు బిల్లాహి మిన షైతానిర్రజీమ్."*

షైతాను విఘ్నాల నుండి అల్లాహ్ శరణు వేడుతున్నాను.

*"బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీం."*

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

*"అల్ హమ్‌దులిల్లాహి రబ్బిల్ ఆలమీన్."*

స్తోత్రం అల్లాహ్ కొరకే. ఆయన సకల లోకాలకు ప్రభువు.

*"అర్రహ్మా నిర్రహీం"*

కరుణామయుడు, దయాసాగరుడు

*"మాలికి యౌమిద్దీన్"*

తీర్పుదినపు యజమాని

"ఇయ్యాక నఅబుదు వ ఇయ్యాక నస్తయీన్"

మేము నిన్నే ఆరాధిస్తాము, సహాయం కొరకు నిన్నే అర్థిస్తాము.

"ఇహ్‌దినస్సిరాతల్ ముస్తఖీమ్"

మాకు సన్మార్గాన్ని చూపు

"సిరాతల్లజీన అన్‌అమ్‌త అలైహిమ్."

ఎవరిపైనయితే నీవు బహుమానాలను కురిపించావో

"గైరిల్ మగ్‌జూబి అలైహిం వలజ్జాల్లీన్"

ఎవరిపైనయితే నీ ఆగ్రహం వర్షించలేదో మరెవరయితే మార్గభ్రష్టులు
కాలేదో - (వారి మార్గాన్ని!)

"ఆమీన్"

ప్రభూ మా ప్రార్థనను స్వీకరించు.

ఆ తరువాత మీరు ఖుర్‌ఆన్ నుండి కొన్ని ఆయత్‌లు (వాక్యాలు) పఠిస్తారు. ఆయత్ ప్రతి దానిలోను అమృతం నిండి ఉంది. బోధా ఉంది. గుణ పాఠమూ ఉంది. మీరు ఫాతిహా సూరాలో చేసిన దుఆకు సంబంధించిన సరైన మార్గదర్శకత్వమూ ఉంది. ఉదాహరణకు ఈ సూరాలను చూడండి.

"వల్ అస్రి ఇన్నల్ ఇన్సాన లఫీ ఖుస్ర్"

కాలం సాక్షిగా! నిస్సందేహంగా మానవుడు పెద్ద నష్టంలో పడి వున్నాడు.

"ఇల్లల్‌లజీన ఆమనూ వ అమిలుస్సాలిహాత్"

విశ్వసించి సత్కార్యాలు చేసేవారు

"వతవాసౌ బిల్ హక్కి వతవాసౌ బిస్‌సబ్ర్"

ఒకరికొకరు సత్యోపదేశం సహనబోధ చేసుకునేవారు తప్ప.

ఈ సూరా ద్వారా, వినాశనం, నిరాశా నిస్పృహల నుండి తప్పుకోవాలంటే మనిషి అల్లాహ్‌ను విశ్వసించి సత్కార్యాలను అవలంబించవలసి ఉందని మనకు బోధపడుతోంది. అంతేకాదు, దైవధర్మంపై నిలకడగా ఉండడానికి ఆ ధర్మాన్ని స్థాపించడానికి ఓ సంఘం ఉనికిలోకి రావాలని, ఆ సంఘంలోని వారంతా పరస్పరం ఒకరికొకరు సహాయ సహకారాలు అందించుకుంటూ ఉండాలని అవగతం అవుతుంది.

మరో ఉదాహరణగా ఈ సూరాను తీసుకోండి.

*అరఅయ్‌తల్లజీ యుకజ్జిబు బిద్దీన్.*
*పరలోక శిక్షను, బహుమానాలను తిరస్కరించే వ్యక్తిని నీవు చూశావా?*

*ఫజాలికల్లజీ యదువ్వుల్ యతీమ్*
*అతడే అనాథులను కసిరికొట్టేవాడు.*

*వలాయహుజ్జు అలా తఆమిల్ మిస్కీన్.*
*పేదవాళ్ళకు అన్నం పెట్టమని ప్రోత్సహించనివాడు.*

*ఫవైలులిల్ ముసల్లీ నల్లజీన హుం అన్‌సలాతిహిం సాహూన్.*
*పోతే, తమ నమాజుల పట్ల అశ్రద్ధ వహించేవారు,*

*అల్లజీన హుం యురాఊన్.*
*ప్రదర్శనా బుద్ధితో వ్యవహరించేవారు*

*వయమ్‌న ఊనల్ మా ఊన్.*
*వాడుకునే మామూలు వస్తువులను ప్రజలకు ఇవ్వడానికి వెనుకాడేవారు*
*సర్వనాశనం అవుతారు.*

ఈ ఆయత్‌ల ద్వారా, పరలోకంపై, విశ్వాసం అనేది ఇస్లామ్ ఊపిరి

అని, ఇది లేకుండా మనిషి రుజు మార్గంపై నడువజాలడని తెలుస్తోంది. ఇంకో సూరాలో ఇలా ఉంది:

"వైలుల్లికుల్లి హుమజతిల్‌లుమజహ్"
ప్రజలను దెప్పిపొడవడంలో, పరోక్షంగా వారి లోపాలను ఎంచడంలో ఆసక్తి కనబరిచేవాడు.

"అల్లజీ జమఅ మాలంవ వ అద్దదహ్"
ధనాన్ని కూడబెట్టి దానిని మాటిమాటికీ లెక్కబెట్టి ఉంచేవాడు అయిన ప్రతి వ్యక్తి సర్వనాశనమవుతాడు.

"యహసబు అన్న మాలహు అఖ్‌లదహ్"
అతడు తన ధనం కలకాలం తన వద్ద ఉంటుందని అనుకుంటున్నాడు.

"కల్లాలయుమ్ బజన్న ఫిల్ హుతమహ్"
అలా ఎన్నటికీ జరగదు. అతడు నుజ్జునుజ్జు చేసే స్థలంలో విసిరివేయబడతాడు.

"వమా అద్‌రాక మల్ హుతమహ్"
అలా నుజ్జునుజ్జుగా చేసే స్థలం ఏమిటో నీకు తెలుసా?

"నారుల్లాహిల్ మూఖదతుల్లతీ తత్తలిఉ అలల్ అఫ్‌ఇదహ్"
అతి తీవ్రంగా ప్రజ్వరిల్లజేయబడిన దైవాగ్ని. అది గుండెల దాకా చొచ్చుకుపోతుంది.

"ఇన్నహా అలైహిం మూసదతున్ ఫీ అమదిమ్ ముమద్దదహ్"
అందులో వారు పడిన తరువాత అది మూసివేయబడుతుంది. ఆ విధంగా వారు పొడుగాటి అగ్ని కీలల మధ్య (చిక్కుకుని) ఉంటారు.

మొత్తానికి మీరు ఖుర్‌ఆన్‌లోని ఎన్ని సూరాలు లేక ఎన్ని ఆయత్‌లనైతే నమాజులో పఠిస్తారో అవి ఏదో ఒక ఉన్నతమైన ఉద్బోధను లేక మార్గదర్శకత్వాన్ని మీకందిస్తాయి. మీరు ఇహలోకంలో అనుసరించవలసిన దైవాజ్ఞలు ఏవో అవి మీకు తెలుపుతాయి. ఈ ఆదేశాల్ని పఠించిన తరువాత మీరు 'అల్లాహు అక్బర్' అంటూ రుకూ చేస్తారు.

మోకాళ్ళపై చేతులానించి మీ ప్రభువు ముందు వంగి మాటిమాటికి *"సుబ్హా న రబ్బియల్ అజీం"* మహోజ్వలుడయిన నా ప్రభువు పరమ పవిత్రుడు అని పలుకుతారు.

ఆ తరువాత నిటారుగా నిలబడుతూ "సమిఅల్లాహులిమన్‌హమిదహ్" అల్లాహ్, తన్ను స్తుతించిన వానిని వింటాడు అని అంటారు. తదుపరి "అల్లాహు అక్బర్" అంటూ 'సజ్దా' చేస్తారు. సజ్దాలో మీరు "సుబ్హా న రబ్బియల్ ఆలా" ఉన్నతుడు అయిన నా ప్రభువు పరిశుద్ధుడు అని పలుమార్లు అంటారు. ఆ తరువాత అల్లాహు అక్బర్ అంటూ సజ్దా చేసిన తరువాత ఎంతో వినయంతో కూర్చుని ఈ దుఆ చదువుతారు.

*అత్తహియ్యాతు లిల్లాహి వస్సలవాతు వత్తయ్యిబాతు*
మా సలాములు, మా నమాజులు సకల పరిశుద్ధ వచనాలు అన్నీ అల్లాహ్‌కే చెందుతాయి.

*అస్సలాము అలైక అయ్యుహన్నబియ్యు వ రహ్మతుల్లాహి వ బరకాతుహు*
*ఓ ప్రవక్తా! మీకు మా సలాములు ఇంకా మీ పై అల్లాహ్ కారుణ్యం మరియు శుభాలు కురియుగాక!*

*అస్సలాము అలైనా వ అలా ఇబాదిల్లా హిస్సాలిహీన్*
మాపైనా, పుణ్యాత్ములైన అల్లాహ్‌దాసులందరిపైనా శాంతి కురుయుగాక

అష్హదుఅల్లా ఇలాహ ఇల్లల్లాహు వఅష్హదుఅన్న ముహమ్మదన్ అబ్దుహు వ రసూలుహ్

అల్లాహ్ తప్ప వేరే ఆరాధ్యుడు లేడని నేను సాక్ష్యం పలుకుతున్నాను. ముహమ్మద్ (సఅసం) అల్లాహ్‌దాసుడు మరియు ఆయన ప్రవక్త అని నేను సాక్ష్యం పలుకుతున్నాను.

ఇలా సాక్ష్యం పలికేటప్పుడు మీరు మీ చూపుడు వ్రేలిని పైకి లేపుతారు. ఎందుకంటే, ఇది నమాజులో మీ విశ్వాసపు ప్రకటన గనకను, ఈ విశ్వాస వచనాన్ని మీరు నోటితో పలికేటప్పుడు శ్రద్ధ చూపవలసిన అవసరం ఉంది గనకను. తదుపరి మీరు 'దరూద్' పఠిస్తారు.

"అల్లాహుమ్మ సల్లిఅలా సయ్యదినా వ మౌలానా ముహమ్మదిన్ వ అలా ఆలి ముహమ్మదిన్ కమా సల్లైత అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్‌మజీద్. అల్లాహుమ్మ బారిక్ అలా సయ్యదినా వ మౌలానా ముహమ్మదిన్ వ అలా ఆలి ముహమ్మదిన్ కమా బారక్‌త అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్ మజీద్".

అల్లాహ్ ఏ విధంగానయితే నీవు ఇబ్రాహీమ్‌పైనా ఇబ్రాహీమ్ అనుచరుల పైనా నీ కారుణ్యాన్ని, నీ శుభాలను అవతరింపజేశావో అదే విధంగా ముహమ్మద్‌పైనా, ముహమ్మద్ అనుచరులపైనా నీ కారుణ్యాన్ని, నీ శుభాలను వర్షింపజెయ్యి. నిస్సందేహంగా నీవే సకల స్తోత్రాలకు అర్హుడవు, నీవే పరమ పవిత్రుడవు.

ఈ దరూద్ పఠించాక మీరు అల్లాహ్‌ను ఈ దుఆతో వేడుకుంటారు.

"అల్లాహుమ్మ ఇన్నీ అవూజుబిక మిన్ అజాబిజహన్నమ్ వ అవూజుబిక మిన్ అజాబిల్ ఖబ్ర్, వ అవూజుబిక మిన్ ఫిత్నతిల్ మసీహిద్దజ్జాల్ వ అవూజుబిక మిన్ ఫిత్నతిల్‌మహ్యా వల్‌మమాతి వ అవూజుబిక మినల్ మ ఆసమి వల్ మగ్రమ్"

ఓ అల్లాహ్ నరక యాతన నుండి నీ శరణు వేడుకుంటున్నాను. ఖబ్ర్ (సమాధి) యాతన నుండి నీ శరణు వేడుకుంటున్నాను. (రుజు) మార్గం నుండి తప్పించే 'దజ్జాల్' సృష్టించే ఉపద్రవం నుండి నీ శరణు వేడుకుంటున్నాను. జీవన్మృత్యువుల విపత్తుల నుండి నీ శరణు కోరుకుంటున్నాను. ఓ అల్లాహ్ దుష్కర్మల బారినుండి మరియు రుణ బాధనుండి నీ శరణు వేడుకుంటున్నాను.

ఈ దుఆ పఠించినంతనే మీ నమాజు పూర్తయిపోయింది. ఇప్పుడు మీరు ప్రభువు దర్బారు నుండి వెనక్కు మళ్ళుతున్నారు. వెళ్ళేటప్పుడు మొదటి పనిగా మీరేంజేస్తారు? మీ కుడి ఎడమల గల వారందరికోసం, ప్రపంచంలోగల ప్రతి వస్తువు క్షేమం కోరి దైవకారుణ్యం కురవాలని దుఆ చేస్తూ "అస్సలాము అలైకుం వరహ్మతుల్లాహ్" అంటారు.

అంటే మీరు దైవ సన్నిధినుండి మరిలేటప్పుడు ప్రపంచం కోసం శుభ వార్తను తెచ్చారన్నమాట.

ఇదీ మీరు ఉదయాన్నే లేస్తూ, ప్రాపంచిక పని పాటల్లో లీనమయ్యే ముందు చేసే నమాజు. ఆ తరువాత కొన్ని గంటల దాకా మీరు మీ పనిపాటల్లో నిమగ్నులైన తరువాత మధ్యాహ్నం దైవసన్నిధిలోనికి చేరి తిరిగి ఇదే నమాజును చేస్తారు. తదుపరి మరికొన్ని గంటల వ్యవధి తరువాత సాయంకాలం ఇదే నమాజును చేస్తారు. ఆ తరువాత ప్రాపంచిక పని పాటల్లో నిమగ్నులై ఉంటూనే సంధ్యా సమయంలో మళ్ళీ తిరిగి చేస్తారు. ఆ తరువాత మీ పనులన్నిటిని పూర్తి చేసి పడుకోబోయే ముందు చివరి సారిగా మీరు మీ ప్రభువు సన్నిధిలోనికి చేరి నమాజు చేస్తారు. ఈ చివరి నమాజు 'విత్ర్'తో ముగుస్తుంది. విత్ర్ నమాజులోని మూడో రకాఅత్‌లో మీరు మీ ప్రభువు ఎదుట ఓ గొప్ప ఒప్పందాన్ని కుదుర్చు కుంటారు. ఇదే 'దుఆయె ఖునూత్'. 'ఖునూత్' అంటే దైవం ఎదుట మనిషి

తన అశక్తతను, వినమ్రతను ప్రకటించడం. ఆయన విధేయత, దాస్యాల స్వీకారం. ఈ స్వీకారాన్ని మీరు ఏ పదాలతో ఉచ్చరిస్తారో చూద్దాం.

> *"అల్లాహుమ్మ ఇన్నానస్తయీనుక వనస్తగ్ఫిరుక వనూ మినూబిక, వనతవక్కలు అలైక, వనుస్నీ అలైకల్ ఖైర్, వనష్కురుక వలా నక్ఫురుక వనఖ్లఉ వనత్రుకు మ(య్యఫ్జురుక అల్లాహుమ్మ ఇయ్యాక న'అబుదు వలకనుసల్లి వనస్జుదు వ ఇలైక నస్ఆ, వనహ్ఫిదు వనర్జూరహ్మతిక వనఖ్ షా అజాబక ఇన్నా అజాబక బిల్ కుఫ్ఫారి ముల్ హిఖ్."*
>
> *ఓ దేవా! మేము నీ సహాయాన్నే అర్థిస్తాము. నీ మార్గదర్శకత్వాన్నే కోరుకుంటాము. మా పాపాల గురించి క్షమాభిక్ష కోరుతాము. నిన్నే విశ్వసిస్తాము. నీపైన్నే భరోసా కలిగిఉంటాము. సకల స్తోత్రాలు నీకే పరిమితం చేస్తాము. మేము నీకు కృతజ్ఞతలను అర్పిస్తాము. కృతఘ్నతను చూపము. నీ ఆజ్ఞలపై నడవని వారిని వదులుకుంటాము. వారితో మా సంబంధాలను తెగత్రెంచు కుంటాము. ఓ అల్లాహ్! మేము నీ దాస్యాన్నే చేస్తాం. నీ కోసమే నమాజు, సజ్దా చేస్తాం. మా సకల ప్రయత్నాలు నీ ప్రసన్నత కొరకే. మేము నీ కరుణా కటాక్షాలకోసం ఎదురు చూస్తూఉంటాం. నీ శిక్షకు భయపడతాము. నిశ్చయంగా నీ కఠిన శిక్ష తిరస్కారులపైన్నే పడుతుంది.*

ముస్లిమ్ సోదరులారా! రోజుకు అయిదు సార్లు పిలువబడే ఈ అజాన్ పిలుపులో ఎంత గొప్ప విషయం గురించి సాక్ష్యం ఇవ్వబడుతోందో, ఏ మహోన్నతమయిన ప్రభువు వైపు పిలువడం జరుగుతోందో ఆలకించి ఓ వ్యక్తి తన పనిపాటలన్నిటిని వదిలేసి తాను విశ్వసించిన ప్రభువు, స్వామి అయిన వాని వైపునకు ఎలా పరుగిడుతాడో చూడండి. ప్రతినమాజుకు ముందే తన శరీరాన్ని, తన మనస్సును వుజూ చేసి శుద్ధి చేసుకుని, ఎన్నో మార్లు నేను పైన చెప్పిన ఆ విషయాలన్నిటిని నమాజులో బాగా గుర్తెరిగి వల్లిస్తాడో అలాంటి వ్యక్తి

హృదయంలో దైవభీతి ఎలా జనించకుండా ఉంటుంది? దైవాదేశాలను అతిక్రమిస్తూ అతడెలా సిగ్గుపడకుండా ఉండగలడు? అతని ఆత్మ పాపాల దుష్కర్మల మరకలతో దైవ సన్నిధిలోకి మాటిమాటికి వెళ్ళడానికి గడగడ లాడకుండా ఎలా ఉంటుంది. మనిషి, నమాజులో దైవ దాస్యాన్నే చేస్తానని ఒప్పుకొని, దేవుని ఎదుట తన నోటితో ఖరారు కూడా చేసి, ఆయన్నే *'మాలికి యౌమిద్దీన్' (తీర్పు దినానికి యజమాని)*గా ఒప్పుకొని, తీరా తన పని పాటల్లో నిమగ్నమైనప్పుడు ఎలా అసత్యమాడగలడు? ఎలా మోసగించగలడు? ఇతరుల హక్కుల్ని ఎలా కొల్లగొట్టగలడు? అవినీతికి ఎలా పాల్పడగలడు? వడ్డీ తీసుకోవడం, ఇవ్వడం ఎలా చేయగలడు? దైవదాసుల్ని ఎలా బాధపెట్టగలడు? అశ్లీలం, వ్యభిచారాల జోలికి ఎలా పోగలడు? అంతేకాదు ఈ దుష్కర్మల భారాన్నంతా మోసుకుంటూ తిరిగి దైవ సన్నిధిలోకి హాజరై వాటి జోలికి పోనని మళ్ళీ ప్రమాణం ఎలా చేయగలడు? నేను నీ దాసుణ్ణే, నీ దాస్యాన్నే చేస్తాను, నీ సహాయాన్నే కోరుకుంటాను అని రోజుకు ముప్ఫై ఆరుసార్లు మీరు ఆయన ఎదుట బాసచేసి, ఆయన కాకుండా మరొకరి ఎదుట సహాయం కోసం చేతులు చాచి యాచించడం ఎలా సాధ్యం? ఒకసారి మీరు దైవంతో ప్రమాణం చేసి దాన్ని ఉల్లంఘిస్తే రెండోసారి ఆయన దర్బారులోనికి హాజరైనప్పుడు మీ అంతరాత్మ మిమ్మల్ని దూషిస్తుంది. మీరు సిగ్గుపడతారు, రెండోసారి కూడా అలా ఉల్లంఘిస్తే మరింత సిగ్గుపడి పోతారు. మీ మనస్సు మిమ్మల్ని మరింత శపిస్తూ ఉంటుంది. మీ జీవితాంతం, ప్రతిరోజు అయిదేసిసార్లు నమాజు చేస్తూ ఉండి మీ కార్యకలాపాలు మాత్రం దారికి రాకపోవడం ఎలా సాధ్యం? మీ నైతికత బాగుపడక పోవడం ఏమిటి? మీ జీవితం మారకుండా ఉండడానికి గల కారణం ఏది? అందుకే అల్లాహ్ నమాజు యొక్క ఈ సద్గుణాల గురించి దివ్య గ్రంథంలో సెలవిచ్చాడు. "ఇన్నస్సలాతతన్హా అనిల్

ఫహషాయి వల్ మున్కర్" నమాజు తప్పకుండా మనిషిని అశ్లీలం నుండి చెడుగులనుండి ఆపుతుంది. కాని ఎవరైనా ఇంత గొప్ప సంస్కరణాత్మక విషయం ద్వారా కూడా సంస్కరింపబడకపోతే అది అతని ప్రవృత్తిలోని తప్పే. నమాజు తప్పు ఏ మాత్రం కాదు. తప్పు నీటిదీ, సబ్బుదీ కాదు, బొగ్గులోగల నలుపుదే.

సోదరులారా! మీరు చేసే నమాజుల్లో ఓ పెద్ద లోపం ఉంది. నమాజుల్లో మీరేదైతే పఠిస్తున్నారో దాన్ని అర్థం చేసుకోవడం లేదు. మీరే గనక కొంత సమయాన్ని వెచ్చిస్తే ఈ మొత్తం దుఆల భావాన్ని మీ మాతృభాషలో గుర్తుంచుకోగలరు. దీని వల్ల మీరు నమాజులో చదివేదానిని అర్థం చేసుకోగలరు.

★ ★ ★

*రోజా కూడా అలానే పనికొస్తుంది). కాబట్టి ఎవరైనా రోజా పాటిస్తూ ఉంటే అతడు (ఈ డాలును ఉపయోగించి) దొమ్మీలు, కలహాలకు దూరంగా ఉండాలి. ఎవరైనా దుర్భాషలాడితే లేక అతనితో తలపడితే (పోరాడితే) అతడు 'అయ్యా! నేను రోజా పాటిస్తున్నాను. నేను ఈ విషయంలో నీతో సహకరించను' అని అనాలి".*

దైవ ప్రవక్త (సఅసం) ప్రకారం ఇతర హదీసుల్లో, రోజా పాటించే వ్యక్తి తన చేతనయినన్ని పుణ్య కార్యాలు చేయాలని, మంచి పనులలో ఉత్సాహం చూపాలని ఉంది. ముఖ్యంగా రోజా స్థితిలో అతనిలో, ఇతర సోదరుల ఎడల వీలైనంత అధికంగా దయాగుణం పొడసూపాలి. ఎందుకంటే ఆకలిదప్పుల బాధ ఏమిటో తాను స్వయంగా అనుభవిస్తాడు. కాబట్టి ఇతర నిరుపేదలు, కష్టాల్లో చిక్కుకున్న వాళ్ళ బాధలేమిటో స్వయంగా అర్థంచేసుకోగలడు. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజిఅన్) గారి ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (సఅసం) స్వయంగా రమజాన్ నెలలో ఇతర దినాల కంటే మరింత దయా, వాత్సల్యాలు చూపేవారు. ఏ యాచకుడూ ఆయన గడపనుండి రిక్తహస్తాలతో వెళ్ళేవాడు కాదు. ఏ ఖైదీ కూడా ఆ దినాల్లో కారాగారాల్లో బంధించబడి ఉండేవాడు కాదు. మరో హదీసులో ఇలా ఉంది:

> *"ఎవరయితే రమజాన్ నెలలో ఓ రోజా దారునికి 'ఇఫ్తార్' చేయిస్తాడో అతని పాపాలన్నీ మన్నించబడతాయి. ఇది అతణ్ణి నరకాగ్ని నుండి తప్పించే మార్గం కాగలదు. రోజా పాటించే వానికి లభించే పుణ్యఫలం అతనికీ లభిస్తుంది. రోజాదారుని పుణ్యఫలంలో ఏ మాత్రం తగ్గింపు జరగదు."*

- సమాప్తం -

ఈ రెండు హదీసుల భావం స్పష్టంగానే వుంది. వీటిద్వారా అర్థమయ్యే దేమిటంటే కేవలం ఆకలిదప్పులను కలిగి ఉండడం ఆరాధనకాదని, ఆరాధన అంటే దాని ద్వారా దైవభీతి కలిగి తద్వారా దైవాదేశాలను ధిక్కరించకుండా ఉండడం. ఇంకా దైవ ప్రేమ ప్రాతిపదికగా, ఆయన ప్రసన్నతను పొందేందుకు ఉత్సాహంగా ముందడుగు వేయడం మరియు చేతనైనంత వరకు మనోవాంఛలకు దూరంగా ఉండడం. ఈ ఆరాధనకు దూరమైన వాడు అనవసరంగా తన పొట్టను మాడ్చుకున్నట్లే. అతణ్ణి పన్నెండు, పద్నాలుగు గంటలపాటు అన్నపానీయాలకు దూరంగా ఉంచే అవసరం అల్లాహ్‌కు ఏం కలిగింది?

రోజా యొక్క అసలు ధ్యేయం వైపునకు దృష్టిని మరల్చుతూ దైవ ప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు:

> *"విశ్వాసం మరియు ఆత్మ పరిశీలనతో ఎవరయితే రోజాలు పాటిస్తాడో అతను చేసిన పాపాలన్నీ క్షమించబడతాయి."*

ఇక్కడ విశ్వాసం అంటే దైవం గురించి ఒక ముస్లింకు ఎలాంటి నమ్మకం అయితే ఉండాలో అది అతని మనసులో సదా తాజాగా ఉండాలి. మరియు ఆత్మపరిశీలన అంటే మనిషి అల్లాహ్ సంతోషాన్నే అభిలషిస్తూ ఎల్లవేళలా తన ఆలోచనలు, ఆచరణలు అల్లాహ్ ఇష్టానికి వ్యతిరేకం కాకుండా పరిశీలిస్తూ ఉండాలి. ఈ రెండు అంశాలను దృష్టిలో ఉంచుకొని ఎవరయితే రమజాన్ మాసపు పూర్తి రోజాలు పాటిస్తాడో అతని గత పాపాలు క్షమించబడతాయన్నమాట. అంటే, ఒకవేళ అతడు గతంలో దైవధిక్కారి అయినా ఇప్పుడతడు దైవం వైపునకు పూర్తిగా మరలాడు అని అర్థం. ఎవరయితే తన పాపాల గురించి తౌబా చేశాడో (మరలాడో) అతడు పాపాలు చెయ్యనట్లే లెఖ్ఖ. మరో హదీసులో ఇలా ఉంది:

> *"రోజా ఓ డాలు వంటిది. (డాలు ఎలాగయితే శత్రువునుండి తనను రక్షించుకోడానికి పనికొస్తుందో షైతాను దాడినుండి రక్షించుకోడానికి*

శక్తి కూడా ఇలాంటిదే. మనిషి రోజా ధ్యేయాన్ని పూర్తిగా అర్థం చేసుకొని దాన్ని బాగా ఆకళింపుచేసుకొని సంకల్ప శుద్ధితో అమలు చేస్తే తప్ప ఆ శక్తి ప్రాప్తం కాదు.

ఈ కారణంగానే అల్లాహ్ రోజా పాటించమని ఆదేశిస్తూ "ల అల్లకుం తత్తఖూన్" *(మీరు దైవభీతి పరాయణులు కావడానికి)* అని సెలవిచ్చాడు. మీరు తప్పకుండా దైవభీతి పరాయణులవుతారని అనలేదు. కారణమేమిటంటే రోజాకు సంబంధించిన ఈఫలితం మనిషి ఆలోచన మరియు అతని సంకల్పంపై ఆధారపడి ఉన్నాయి. ఎవరయితే ఈ ధ్యేయాన్ని అర్థం చేసుకుని దాన్ని పొంద డానికి ప్రయత్నం చేస్తాడో అతడు అంతో ఇంతో "ముత్తఖీ" (దైవభీతి పరాయణుడు) కాగలడు. కాని ఎవరయితే ఆ ధ్యేయాన్ని తెలుసుకోకుండా దాన్ని పొందే ప్రయత్నమే చేయడో అతనికి రోజా వల్ల ఎలాంటి ప్రయోజనం చేకూరే ఆశలేదు.

దైవప్రవక్త (సఅసం) వివిధ రకాలుగా రోజా యొక్క అసలు ధ్యేయం వైపునకు దృష్టిని మరల్చారు. ధ్యేయాన్ని దృష్టిలో ఉంచుకోకుండా పస్తులు ఉండడం ఎలాంటి ప్రయోజనాన్ని చేకూర్చలేదు. ఆయన (సఅసం) ఇలా ప్రవచించారు:

> *"ఎవరయితే అసత్యం పలకడం, అసత్యంపై అమలు చేయడం వదిలిపెట్టడో అతని అన్నపానీయాల్ని మాన్పించే అవసరం అల్లాహ్‌కు ఎంత మాత్రం లేదు."*

మరో ప్రవచనంలో ఇలా ఉంది:

> *"చాలామంది రోజా పాటించే వారికి రోజా ద్వారా ఆకలిదప్పులు తప్ప మరేమీ లభించదు. ఇంకా చాలామంది రాత్రి నమాజు చేసేవారికి, ఆ నమాజువల్ల జాగారం చేయడం తప్ప మరేమీ లభించదు."*

కున్న ఆ తప్పుడు అర్థమే అని నేను నిక్కచ్చిగా చెప్పగలను. "సహర్" అంటే ఉషోదయం నుండి సూర్యాస్తమయం వరకు ఏమీ తినకుండా, తాగకుండా ఉండడమే రోజా అని, అదే దైవారాధన అని మీరు అనుకుంటారు. అందుకే మీరు రోజాను ఎంతో జాగ్రత్తగా పాటిస్తూ ఉంటారు. ఆ కాలంలో మీ హృదయాల్లో ఉండే దైవభీతి ఎంత ఉన్నతమైందంటే ఫలానా పని రోజాను భంగ పరుస్తుందని తెలిస్తే దానికెంతో దూరంగా వుంటారు.

ప్రాణం మీదికొచ్చినా సరే మీరు రోజాను భంగపరచరు. అయితే ఈ ఆకలిదప్పులతో కాలం గడపడం అసలు ఆరాధన కానే కాదు. అది ఆరాధనా రూపం మాత్రమే అని మీకు తెలియదు. ఈ రోజా రూపాన్ని నిర్ణయించడానికి గల కారణం మీలో దైవభీతి, దైవం ఎడల ప్రేమ జనించాలన్నది. అంటే, ఓ విషయంలో మీకు ఎనలేని ప్రయోజనాలు కనబడినా దైవం దాన్ని సమ్మతించడం లేదు అని తెలిస్తే దాన్ని త్యజించే శక్తి జనించాలి. మరో విషయంలో మీకు ఎన్నో ప్రమాదాలు, నష్టాలు వున్నా దైవసంతుష్టి ఆ విషయంలోనే ఉంటే, మనసును బలవంతంపెట్టయినా సరే దాన్ని స్వీకరించే సామర్థ్యం మీలో కలగాలి. ఈ శక్తి సామర్థ్యాలన్నీ మీరు రోజా ధ్యేయాన్ని తెలుసుకున్నప్పుడే సాధ్యపడతాయి. అయితే, దైవభీతి దైవ ప్రేమలతో మీ కోరికలను అణచి, దైవ ప్రసన్నతకు అనుగుణంగా మనసును నడిపించే నెల రోజుల అభ్యాసం ద్వారా ప్రయోజనం పొందవలసింది. కాని మీరు రమజాన్ అయిపోగానే ఈ అభ్యాసం ద్వారా లభించిన సుగుణాలన్నింటినీ భోజనం చేసి నోట్లో వేళ్లుపెట్టి కక్కివేసిన తీరుగా పారేస్తున్నారు. ఇంకా చెప్పాలంటే మీలో కొందరు రోజా విడవగానే దానితోపాటు దైవభీతిని కూడా విడిచిపెడతారు. ఇక మీరే చెప్పండి! రోజాలు ఏమైనా ఇంద్రజాలం లాంటివా? కేవలం వాటి బాహ్య రూపాన్ని నెరవేర్చగానే అసలు రోజా పాటించడం ద్వారా లభించే శక్తి సామర్థ్యాలు లభించడానికి? భోజనం జీర్ణమై, రక్తంగా మారి శరీరంలోని కణాలన్నిటికీ చేరితే తప్ప భోజనం ద్వారా శరీరానికి శకి ఒనగూడదు. అలాగే రోజా ద్వారా ఒనగూడే ఆధ్యాత్మిక

గ్రక్కినా సరే. ఇది నిజం కాకపోతే మీరే చెప్పండి జరుగుతున్నదేమిటో. పొద్దస్తమానం రోజా పాటిస్తూ దైవారాధనలో నిమగ్నుడైన వ్యక్తి, ఈ ఆరాధన సమయంలో అబద్ధం ఎలా చెబుతాడు? పరోక్షనిందకు ఎందుకు పాల్పడుతున్నాడు? ప్రతి చిన్న విషయానికి ఎందుకు జగడమాడుతున్నాడు? అతని నోట బూతులు ఎందుకు వెలువడుతున్నాయి? ఇతరుల హక్కుల్ని ఎలా కాజేయగలుగుతున్నాడు? హరామ్ తినడం, హరామ్‌నే తినిపించడం ఏ విధంగా చేయగలుగుతున్నాడు? ఈ పనులన్నీ చేస్తూనే తాను, నేను దైవారాధన చేస్తున్నాను అని ఎలా అనుకుంటాడు? అతని ఉదాహరణ అచ్చం మట్టి, రాళ్ళు, బూడిద తిని నేను తినడానికి కావలసిన ప్రక్రియలన్నీ నెరవేర్చాను, దీన్నే భుజించడం అని అంటారు అని అనుకునే వ్యక్తిలా లేదు?

రమజాన్ నెలలో దాదాపు మూడొందల అరవై గంటలు దైవారాధనలో నిమగ్నమై ఉండి, ఆ ఆరాధనను పూర్తి చేసిన తరువాత దాని ప్రభావం షవ్వాల్ నెల మొదటి రోజే, అనగా ఈదుల్ ఫిత్ర్ నాడే ఎందుకు మటుమాయమైపోతుందో చెప్పండి? ఇతరులు తమ పండుగల్లో చేసేదంతా మీరూ ఈద్‌నాడు చేస్తూ ఉంటారు. చివరికి పట్టణాల్లో ఈద్‌నాడే వ్యభిచారం, మద్యపానం, జూదం కూడా నడుస్తాయి! కొందరు దుర్మార్గులు రమజాన్ కాలంలో పగలంతా రోజాపాటించి, రాత్రికి సారాయి త్రాగడం, వ్యభిచరించడాన్ని నేను చూశాను. సాధారణ ముస్లిములయితే దైవకృపవల్ల అంతగా దిగజారలేదు. కాని రమజాన్ మాసం ముగియగానే ఈద్ అయిన మరునాడు ఎందరిలో దైవభీతి ప్రభావం మిగులుంటుంది? దైవ చట్టాల ధిక్కరణలో ఎవరైనా వెనుకంజవేస్తున్నారా? పుణ్యకార్యాల్లో ఎంతమంది పాలుపంచుకుంటున్నారు? మనోవాంఛల పరిపూర్తిలో లీనం కాని వారు ఎందరు?

దీనిక్కారణం ఏమై ఉంటుందో ఆలోచించండి! దీని అసలు కారణం ఒక్కటేనని, అది మీ మనోమస్తిష్కాల్లో ఆరాధన అన్న పదానికి మీరు ఊహించు

జీవించేందుకు కావలసిన శక్తి రావాలి అని అనుకున్నాడు: అందుకే అతడు ఈ భోజనం బరువును కడుపులో ఎందుకు ఉంచుకోవాలి? దాన్ని తీసేస్తే సరిపోతుంది కదా! భోజనం చేసే ప్రక్రియను నేనెలాగూ నెరవేర్చానుగా. ఈ పిచ్చి ఆలోచన రావడమే తడవు భోజనాన్ని బయటకు తీసివేశాడు. దానికి శిక్ష అతడు గాక మరెవరు అనుభవిస్తారు? తిన్న భోజనం జీర్ణాశయంలోకి పోయి జీర్ణమయితే తప్ప రక్తంగా మారి శరీరం మొత్తంలోనికి ప్రవహించదు. అప్పటికిగాని జీవించేశక్తి లభించదు. ఈ విషయం అతనికి తెలియవలసింది. తినే ప్రక్రియ కూడా అవసరమే. ఇవి లేకుండా భోజనం జీర్ణాశయం వరకు చేరదు. కాని కేవలం ఈ ప్రక్రియల్ని మాత్రమే నెరవేరిస్తే సరిపోదు. ఈ ప్రక్రియల్లో ఏ ఇంద్రజాలం లేదు-వాటిని నెరవేర్చగానే మనిషి రక్తనాళాల్లో రక్తం ప్రవహించడానికి. రక్తం వృద్ధికావడానికి అల్లాహ్ ఏ నియమాన్నైతే బెట్టాడో దాని ప్రకారం అది తయారవుతుంది. ఆ నియమాన్ని వ్యతిరేకిస్తే మీరే నామరూపాల్లేకుండా పోతారు.

ఇంత విపులంగా మీ ముందుంచిన ఈ ఉపమానం గురించి కొంత ఆలోచిస్తే, నేడు మీ ఆరాధనలన్నీ ప్రభావ శూన్యాలెందుకయ్యాయో మీకే బోధపడుతుంది. ఇదివరకు నేను ఎన్నోమార్లు మీకు చెప్పినట్లు, అసలు పొరపాటంతా మీరు నమాజు, రోజాల బాహ్యప్రక్రియల్నే 'ఆరాధన' అని అనుకోవడం. అలా పొరబడి ఎవరైతే ఈ ప్రక్రియల్నే పూర్తి చేశారో వారే దైవారాధన నిర్వహించారని అనుకున్నారు మీరు. మీ ఉదాహరణ అచ్చం, ముద్దలుగా కలుపటం, నోటిలో పెట్టుకోవడం, నమలడం మరియు మ్రింగడం ఈ నాలుగు పనులు చేయడమే భుజించడం అని అనుకునేవాడికి భిన్నంగా లేదు. ఈ నాలుగు ప్రక్రియల్ని పూర్తి చేసిన వెంటనే అతడు భుజించటం అన్న పనిని పూర్తిచేశాను, భుజించడం వల్ల కలగవలసిన ప్రయోజనాలన్నీ అతనికి చేకూరాలి అని అనుకుంటాడు ఆ వ్యక్తి -అతడు తన ఈ ప్రక్రియలో మట్టి, రాళ్ళు రప్పలు మరే వస్తువును కడుపులో వేసుకున్నా సరే, లేదా అన్నం తిని

# ౯౮

# రోజా అసలు ధ్యేయం

ముస్లిమ్ సోదరులారా! మనిషిచేసే ప్రతి పనిలో రెండు విషయాలు తప్పకుండా ఉంటాయి. ఆ పని ఏ లక్ష్యం కోసం చేస్తున్నామన్నది ఒకటయితే, ఆ పని చేసే ప్రత్యేక విధానం ఏది? అన్నది రెండోది. ఉదాహరణకు భోజనం చేసే ప్రక్రియనే తీసుకుందాం. ఏ ధ్యేయాన్ని ముందుంచుకొని మనం భోజనం చేస్తాం? జీవించి ఉండడానికి, శరీరానికి కావలసిన శక్తిని పొందడానికే కదా మనం భోజనం చేసేది. ఈ లక్ష్యాన్ని పొందేందుకు మనం అవలంబించే ప్రక్రియ ఏమిటి? అన్నమును కలుపుకొని ముద్దలుగా చేయడం. ముద్దను నోట్లో పెట్టి నమిలి మ్రింగడం. ఈ ధ్యేయాన్ని పొందడానికి, ఇంతకంటే సులువైనది, సరిఅయిన పద్ధతి మరొకటి లేదు. కాబట్టి మనం దీన్నే అవలంబించాం. అయితే మీలో ప్రతి వ్యక్తికి, అసలు ధ్యేయం భోజనం చేయడం అని, భోజనం చేసే ప్రక్రియ మాత్రం కాదని తెలుసు. ఎవరైనా రంపపు పొట్టో, లేక బూడిదో లేక మన్నో తీసుకొని ముద్దలుగా చేసి నోట్లో పెట్టుకొని నమిలి మింగితే అలాంటి వ్యక్తిని మీరేమంటారు? ఉత్త పిచ్చి బాగులవాడని అనరా? ఎందుకు? ఈ తెలివిలేనివాడు అసలు ధ్యేయాన్ని అర్థం చేసుకోలేదు, ముద్దలు చేయడం, నోట్లో పెట్టుకోవడం నమలడం మ్రింగడాన్నే భుజించడం అనుకున్నాడు. ఇదే విధంగా ఎవరైనా భోజనం చేసిన వెంటనే తన నోట్లో వ్రేళ్ళుపెట్టి తిన్నదాన్ని కక్కివేస్తాడు. తరువాత భోజనం చేయడం వల్ల నాకు ఎలాంటి ప్రయోజనం కలగడం లేదు, రోజు రోజుకు కృశించి పోతున్నాను, చావుకు దగ్గర పడ్డాను అని అంటే అతణ్ణి కూడా మీరు పిచ్చివాని క్రిందికే జమకడతారు. ఈ బుద్ధి హీనుడు తాను బలహీనుడైనందుకు భోజనం మరియు భోజనం చేసే ప్రక్రియ మీద నిందమోపుతున్నాడు. తప్పంతా అసలు తనదే. తన బుద్ధి హీనత వల్ల భుజించే ప్రక్రియలో ఏ పనులయితే ఉన్నాయో వాటిని నెరవేర్చేశాను ఇంకా నాకు

వస్తాయి. ఈ ఫలితాలు ఆ వ్యవస్థ ఖచ్చితంగా, కట్టుదిట్టంగా ఉన్నప్పుడే లభించగలవు. పైగా ఆరాధనల గురించిన మీ దృక్పథం పూర్తిగా మారిపోయింది. ఉదయం నుండి సాయంత్రం దాకా ఉపవాసం ఉండటాన్ని మీరు ఆరాధన అని భావిస్తున్నారు. దీన్ని నిర్వర్తించి ఆరాధన నెరవేరిందని అనుకుంటున్నారు. ఇదే విధంగా ఇతర ఆరాధనల విషయంలోనూ కేవలం బాహ్య రూపాన్ని మీరు ఆరాధనగా భావిస్తున్నారు. మీరు చేసే ప్రతి పనిలో కానరావలసిన ఆరాధనా సారం పట్ల మీలోని తొంభై తొమ్మిది కన్నా అధికశాతం ప్రజలు ఏమీ ఎరుగరు. అందువల్లే ఈ ఆరాధనలు వాటి పూర్తి ప్రయోజనాల్ని చూపించడం లేదు. ఎందుకంటే ఇస్లామ్‌లో, చిత్తశుద్ధి, సత్‌సంకల్పం, అవగాహన పైన్నే అంతా ఆధారపడి ఉంది.

ఇన్షా అల్లాహ్ రాబోయే ప్రసంగాల్లో ఈ విషయం గురించి పూర్తి వివరాలను ఇవ్వగలను.

★ ★ ★

మాసంలో పుణ్యం, దైవభీతికి కూడా తగిన వాతావరణం ఏర్పడుతుంది. ఈ కారణంగానే దైవ ప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు.

*"మనిషి చేసే పుణ్యకార్యం దైవం వద్ద ఎంతో కొంత పెరుగుతూ ఉంటుంది. ఒక పుణ్యకార్యం పది రెట్లు లగాయతు ఏడు వందల రెట్ల వరకు అభివృద్ధి చెందుతుంది. కాని 'రోజా విషయం మటుకు వేరైనది, అది ప్రత్యేకంగా నా కొరకే (కాబట్టి) నేను దానికి నా ఇష్ట మొచ్చిన రీతిలో ప్రతి ఫలాన్ని ప్రసాదిస్తాను' అని అల్లాహ్ అంటాడు".*

ఈ హదీసు ద్వారా మనకు తెలిసేదేమిటంటే ఏ సంకల్పంతో మనం పుణ్యకార్యాలు చేస్తామో ఆ సంకల్పశుద్ధి ప్రకారం మన కర్మల ఫలితాలు అక్కడ పెరుగుతూ ఉంటాయి. వాటి పెరుగుదలకు ఓ హద్దంటూ ఉంది. కాని రోజాకు హద్దు లేదు. రమజాన్ మాసం, శాంతి శుభాలు విలసిల్లే కాలం. ఈ రుతువులో ఒక్క వ్యక్తే కాదు, కోట్లాది ముస్లిములు కలగలిసి ఈ పుణ్యకార్యాలను వికసింపజేస్తారు. కాబట్టి పుణ్యకార్యాలు అసంఖ్యాకంగా పెరిగిపోతుంటాయి. ఈ నెల్లో పుణ్య కార్యాలు ఎంత చిత్తశుద్ధితో చేస్తారో దీని శుభాల ద్వారా తామూ ప్రయోజనం పొంది, ఏ మేరకు ఇతరులకూ ప్రయోజనం కలిగిస్తారో, ఈ నెల ప్రభావాలను మిగతా పదకొండు నెలల్లో ఎంతవరకు కాపాడతారో అంతగానే ఈ పుణ్యకార్యాలు వృద్ధి చెందుతాయి. కాని మీరు మీ నడవడిక ద్వారా ఆ శుభాన్ని పరిమితం చేసుకుంటే అది మీ తప్పు.

రోజాకు సంబంధించిన ఈ ప్రయోజనాలు, ఈ సత్ఫలితాలు విన్న మీ ప్రతి ఒక్కరి మనస్సులో, ఈ ఫలితాలు, ఈ ప్రభావాలు నేడేవి? మేము రోజాలు పాటిస్తూనే ఉన్నాం, నమాజులు చేస్తూనే ఉన్నాం. అయితే మీరిప్పుడు చెప్పిన ఫలితాలేవీ నేడు కానరావడం లేదే అనే ప్రశ్నలు ఉద్భవిస్తాయి. దీనికి కారణం ఇది వరకే వివరించాను. అదేమిటంటే ఇస్లామ్ యొక్క భాగాలన్నిటిని వేరుచేసి, వాటి స్థానంలో క్రొత్త విషయాలను చేర్చి ఫలితాలు రమ్మంటే ఎలా

పరేడు చేస్తుంది. అందరూ ఒకేసారి బిగిల్‌పై లేవడం, ఆ బిగిల్ శబ్దంపై పని చేయాల్సి వుంటుంది. తద్వారా వారిలో ఒకే జమాఅత్‌గా తయారై అందరూ కలిసి పనిచేసే అలవాటు అవుతుంది. దీనికి తోడు వారంతా కలిసి ఒకరి శిక్షణలో మరొకరు చేదోడు వాదోడుగా ఉండగలరు. అంటే ఒక వ్యక్తి శిక్షణలో ఏదైనా లోపం ఉండిపోతే ఆ లోపాన్ని రెండోవాడు, రెండోవాని లోపాన్ని మూడో వాడు సరిదిద్దగలడు. ఇదేవిధంగా ఇస్లామ్‌లోను, రమజాన్ నెల రోజా ఆరాధన కోసం ప్రత్యేకించబడింది. ఇందులో ముస్లిములందరికి ఒకే సమయంలో, అందరు కలిసి రోజాలు పాటించాలి అని ఆదేశం ఇవ్వడం జరిగింది. ఈ ఆదేశం, వ్యక్తిగత ఆరాధనను సామూహిక ఆరాధనగా మార్చివేసింది. ఒకటిని లక్షతో హెచ్చిస్తే, ఒక లక్షగా మారినట్లే ఒక్కొక్క వ్యక్తి రోజాలు పాటించడం వల్ల ఏ నైతిక, ఆధ్యాత్మిక ప్రయోజనాలు చేకూర్తాయో అలాగే లక్షలాది, కోట్లాది మంది కలిసి రోజాను పాటించడం వలన లక్షలాది, కోట్లాది రెట్ల ప్రయోజనం ఒనగూడుతుంది. రమజాన్ నెల పూర్తి వాతావరణమే పుణ్యకార్యం, దైవభీతి అనే సుగుణాలతో నిండి పోతుంది. ఓ విధంగా పూర్తి ముస్లిమ్ సమాజమే దైవ భీతితో సస్యశ్యామలమవుతుంది. ప్రతివాడు స్వయంగా పాపాలకు దూరంగా ఉండడమే గాక, రోజా పాటించే ఇతర సోదరులు కూడా అతని లోపాలను సరిదిద్దేందుకు తోడ్పడతారు. ప్రతివాడూ రోజా పాటిస్తూ పాపకార్యాలు చేయడానికి సిగ్గుపడతాడు. ఇదే విధంగా ప్రతి వ్యక్తిలోను రోజా పాటిస్తూ ఏదో ఒక పుణ్యకార్యం చేయాలనే బుద్ధి కూడా పుడుతుంది. ఏ పేదవానికయినా భోజనం పెట్టాలని, బట్టలు లేని వానికి బట్టలు కొనిపెట్టాలని, కష్టంలో ఉన్న వానికి సహాయపడాలని, ఎక్కడైనా, ఏదైనా పుణ్యకార్యం జరుగుతూ ఉంటే అందులో పాలుపంచుకోవాలని, బహిరంగంగా ఏదైనా చెడు పని జరుగుతూ ఉంటే దాన్ని ఆపాలని అనుకుంటాడు. పంటలు కోతకు వచ్చినప్పుడు పొలాలు ఎలా బంగారు రంగుతో భాసిస్తూ ఉంటాయో అలాగే ఈ రమజాన్

*విశ్వసించిన ఓ ప్రజలారా! గతించిన సమాజాల వారికి ఏ విధంగానయితే రోజా ఫర్జు చేయబడిందో, మీకు కూడా రోజా ఫర్జు చేయబడింది - మీరు దైవానికి భయపడాలనే.*

రోజాలో మరో విశేషం ఉంది. ఓ సుదీర్ఘ కాలం వరకు మనిషిని షరీఅత్‌పై నడిపించడమే ఆ విశేషం. నమాజు చేసే కాల పరిమితి కొన్ని నిమిషాలకంటే ఎక్కువ ఉండదు. జకాత్ చెల్లించేది సంవత్సరానికి ఒక మారే. హజ్‌లో మాత్రం ఓ దీర్ఘకాలం వెచ్చించబడుతుంది. అయితే దాని అవకాశం జీవితం మొత్తంలో కేవలం ఒకసారి మాత్రమే. ఆ అవకాశం కూడా అందరికీ లభించదు. వీటన్నిటికి భిన్నంగా ప్రతి సంవత్సరం పూర్తి ఒక నెల వరకు రేయింబవళ్ళు ఇస్లామీయ షరీఅత్‌పై నడుచుకునే అభ్యాసం చేయిస్తుంది ఈ రోజా. తెల్లవారు ఝామున్నే సహరీ కోసం లేవడం; ఖచ్చితంగా ఫలానా సమయానికి తినడాన్ని త్రాగడాన్ని ముగించడం, పగలంతా ఫలానా పనులు మాత్రమే చేయొచ్చు, ఫలానా పనులు చేయడానికి వీల్లేదు. సాయంత్రం ఖచ్చితంగా ఫలానా టైముకు ఇఫ్తార్ చేయడం ఆ తరువాత భోజనం చేసి కొంచెం సేపు సేద తీర్చుకోవడం, వెంటనే తరావీహ్ కోసం త్వరపడడం. ఇలా ప్రతి ఏడు పూర్తిగా ఒక నెల వరకు ఉదయం నుండి సాయంత్రం వరకు, సాయంత్రం నుండి తిరిగి సహరీ వరకు ఓ ముస్లిమ్‌ను సైనికునిలా నియమ, నిబంధనలకు కట్టుబడేటట్లు చేస్తుంది ఎడతెగకుండా. ఈ నెలంతా పొందిన శిక్షణకు సత్ప్రభావాలు వెలువడేందుకు పదకొండు నెలల అవకాశం ఇవ్వడం జరుగుతుంది. అప్పుడు ఏదైనా లోపం ఉండిపోతే మరో సంవత్సరపు శిక్షణలో అది పూర్తిగా చక్కదిద్దబడుతుంది.

ఈ విధమైన ట్రైనింగ్ కోసం ఒక్కొక్కరిని వేరు వేరుగా తయారు చేయడం సరైంది కాదు. సైన్యంలోను ఒక్కొక్కరికి వేరువేరుగా పరేడు చేయించబడదు అన్న విషయం మీకు తెలుసు. సైన్యం మొత్తం ఒకేసారి

రోజాను భంగపర్చే ఏ పని చేయకుండా ఉంటాడు? పరలోకంపై ఎంతో గట్టి నమ్మకం ఉంటేనే గదా అతడు నెల్లాళ్ళు, దాదాపు మూడొందల అరవై గంటల వరకు రోజా ఉండగలుగుతున్నాడు. ఈ కాలంలో ఎప్పుడైనా ఓ క్షణం కోసం పరలోకం ఎడల ఎలాంటి అనుమానం పొడసూపదు. ఈ విషయంలో అతనికి, ప్రళయం వస్తుందో లేదో, అంతిమ దినం నాడు పాప పుణ్య కార్యాల ఫలితం లభిస్తుందో లేదో అనే అనుమానం కలిగితే తన రోజాను సక్రమంగా పూర్తిచేసి ఉండేవాడే కాదు. అనుమానం వచ్చిన తరువాత మనిషి దైవాజ్ఞ పాలనలో ఏమీ తినకుండా త్రాగకుండా ఉండలేడు.

ఇలా అల్లాహ్ ప్రతి సంవత్సరం పూర్తిగా ఒక నెల వరకు ముస్లిమ్ యొక్క విశ్వాసాన్ని పరీక్షిస్తూ ఉంటాడు. ఈ పరీక్షలో మనిషి ఎంతైతే నెగ్గుకు వస్తుంటాడో అతని విశ్వాసం కూడా అంతే పటిష్టమవుతూ ఉంటుంది. అంటే ఇది ఒక విధంగా పరీక్ష, మరో విధంగా శిక్షణ కూడా. మీరు ఎవరివద్దయినా అమానతుగా కొంత సొమ్ము ఉంచదలిస్తే అతని నిజాయితీని పరీక్షిస్తారు. ఒకవేళ అతడు నిజాయితీ గలవాడయితే, అమానతును కాజేయకుండా ఉండగలిగితే, మరిన్ని అమానతులను భరించే శక్తి అతనిలో పెరుగుతుంది. అతడు మరింత అమానతుదారుడుగా తయారవుతాడు. ఇదే విధంగా అల్లాహ్ కూడా నిరంతరం ఒక నెల వరకు, రోజూ ఎడతెగకుండా దాదాపు పధ్నాలుగు గంటల వరకు మీ విశ్వాసాన్ని గట్టిగా పరీక్షిస్తున్నాడు. మీరు ఈ పరీక్షలో పూర్తిగా నెగ్గితే మీలో దైవానికి భయపడి ఇతర పాపాలనుండి దూరంగా ఉండే సామర్థ్యం పుట్టుకు వస్తుంది. అల్లాహ్‌కు పరోక్ష విషయాల జ్ఞానం కూడా వుంది అనే నమ్మకంతో చాటుమాటుగా కూడా ఆయన చట్టాల్ని ఉల్లంఘించకుండా ఉంటారు. అడుగడుగునా ప్రళయ దినం మీకు గుర్తుకురాగానే, అక్కడ ప్రతి విషయం యొక్క బండారం బయటపడుతుంది, ఎలాంటి రాయితీ లేకుండా సత్కర్మకు సత్ఫలితం, దుష్కర్మకు దుష్ఫలితాలు లభిస్తాయి అని భయపడతారు. ఈ ఆయత్ యొక్క భావం కూడా అదే.

జీవితం అంతా దైవదాస్యంగా మారేటట్లు చేయడం అని అర్థం. ఇదే దీని ఉద్దేశ్యం కూడా. ఈ ధ్యేయాన్నే ముందుంచుకొని, రోజా మనిషిని ఎలా ఆ గొప్ప ఆరాధన కోసం సమాయత్తపరుస్తుందో చూద్దాం.

రోజా తప్ప ఇతర ఏ ఆరాధనలైనా అవి ఏదో ఓ విధంగా బాహ్యకదలికల ద్వారా నిర్వహించబడేవే. ఉదాహరణకు మనిషి నమాజులో లేచి నిలబడడం, కూర్చోవడం, రుకూ మరియు సజ్దాలు చేయడం లాంటిది. ఈ బాహ్య కదలికలు ప్రతి వ్యక్తికి అగుపడతాయి. హజ్‌లో మనిషి ఓ సుదీర్ఘమైన ప్రయాణంపై వెళ్ళొస్తాడు. లక్షలాది మందితో కలిసి హజ్ చేస్తాడు. జకాత్ కూడా ఎవరో ఒకరు చెల్లిస్తే మరొకరు స్వీకరిస్తారు. ఈ ఆరాధనలు ఎవరికీ కనబడకుండా చేయలేము. అలాగే చేయకుండా వుంటే ఇతరులకు ఇట్టే తెలిసి పోతుంది. దీనికి భిన్నంగా రోజా అనే ఆరాధన మట్టుకు దైవానికి, దాసునికి తప్ప మూడో వాడికి తెలిసేది కాదు. ఓ వ్యక్తి అందరూ చూస్తూ ఉండగా 'సహరీ' భుజించి ఇఫ్తార్ వరకు ఏమీ తినకుండా, త్రాగకుండా కనబడినా, చాటుమాటుగా నీరు త్రాగేస్తే, అల్లాహ్‌కు తప్ప ఈ విషయం ఎవరికీ తెలియదు. చూసే వాళ్ళంతా అతడు రోజాను పాటిస్తున్నాడు అనే అనుకుంటారు గాని యదార్థంగా అతడు రోజాను పాటించడం లేదు.

రోజా యొక్క ఈ లక్షణం దృష్టిలో ఉంచుకొని కొంచెం ఆలోచించండి! నిజంగా రోజా పాటించే వ్యక్తి చాటుగా ఏమీ తినడు, తీవ్రమైన ఎండలో దాహం వల్ల గొంతు ఎండి పోతున్నా ఓ చుక్క మంచినీళ్ళు కూడా త్రాగడు, తీవ్రమయిన ఆకలివల్ల కళ్ళు బైర్లు కమ్ముతున్నా తినే ఆలోచననైనా రానివ్వడు. ఇలాంటి వ్యక్తి హృదయంలో అల్లాహ్ అన్నీ చూస్తున్నాడు, ఆయనకు అన్నీ తెలుసు అన్న విశ్వాసం ఎంత బలంగా ఉండి ఉంటుంది? ఎంత గట్టి నమ్మకం ఉంటేగాని అతడు, నా ఈ చర్యను ఎవ్వరూ చూడకపోయినా అల్లాహ్ చూస్తున్నాడని అనుకుంటాడు? ఎంత దైవభీతి ఉంటేగాని అతడు ఎంత కష్టాన్నైనా ఎదుర్కొని

అసలు ధ్యేయం మనిషి జీవితం మొత్తాన్నే దైవారాధనగా మార్చడం అన్న విషయం మీకు నేను ఇంతకు ముందే ఎన్నోసార్లు చెప్పియున్నాను. మనిషి 'అబ్ద్' అంటే దాసునిగానే పుట్టాడు. దైవ దాస్యం అతని నైజం. కాబట్టి దైవ దాస్యం అంటే ఆలోచనల్లో, ఆచరణల్లోను, అల్లాహ్ దాస్యం చేయకుండా అతడు ఓ క్షణం కూడా స్వతంత్రునిలా ఉండరాదు. అల్లాహ్ సంతోషం, ఇష్టం ఎందులో ఉంది? ఏ కారణం చేత ఆయనకు ఆగ్రహం కలుగుతుంది? ఆయన అయిష్టత ఏ విషయంలో ఉంది అని గమనిస్తూ జీవితంలోని ప్రతి వ్యవహారంలోను మెలగాలి. దైవ ప్రసన్నత వైపునకు ముందడుగు వేయడం, దైవాగ్రహానికి, నరకాగ్నికి దూరంగా ఉండడం అవసరం. అల్లాహ్‌కు ఇష్టమైన విధానాన్ని అనుసరించాలి. ఆయనకు ఇష్టంలేని మార్గాన్ని అవలంబించరాదు. మనిషి తన జీవితాన్నంతటిని ఈ తరహాలో మార్చుకున్నప్పుడు అతడు తన యజమాని దాస్యాన్ని సరిగ్గా నెరవేర్చాడని అర్థం. అప్పుడే అతడు -

"వమాఖలక్తుల్ జిన్న వల్ఇన్స ఇల్లా లియాఅబుదూన్"
*నేను జిన్నుల్ని, మనుషుల్ని పుట్టించింది నా దాస్యం కొరకే అన్న ఖుర్ఆన్ వాక్యం ఉద్దేశ్యం నెరవేరుతుంది.*

నమాజ్, రోజా, హజ్, జకాత్ అనే ఫర్జు చేయబడిన ఆరాధనల అసలు ధ్యేయం ఈ గొప్ప ఆరాధనకోసం మనల్ని సమాయత్తపరచడమే అని నేను ఇదివరకే చెప్పియున్నాను. వాటిని ఫర్జు చేయడం అంటే, మీరు రోజుకు అయిదు పూటలు రుకూ, సజ్దాలు చేస్తే, రమజాన్ నెలలో ముప్పైరోజుల దాకా పొద్దస్తమానం ఆకలిదప్పుల్ని సహిస్తే, మీరు ధనవంతులైనందుకు సంవత్సరానికో మారు జకాత్ చెల్లిస్తే, జీవితంలో ఓసారి హజ్ చేసి వస్తే, మీపై వున్న అల్లాహ్ హక్కును నెరవేర్చారని అర్థం కాదు. ఆ తరువాత మీరు ఆయన దాస్యం నుండి విముక్తులై స్వతంత్రంగా ఏది చేసినా చెల్లుతుంది అనీ అర్థం కాదు. అసలు ఈ ఆరాధనలను ఫర్జు చేయడం అంటే వాటి ద్వారా మనిషికి శిక్షణనిచ్చి, అతని

# రోజా

ముస్లిమ్ సోదరులారా! అల్లాహ్ మీపై ఫర్జ్ చేసిన రెండో ఆరాధన రోజా. రోజా అంటే మనిషి, ఉషోదయం మొదలు సూర్యాస్తమయం వరకు తినడం, త్రాగడం, సంభోగాలకు దూరంగా ఉండడం. నమాజులాంటిదే ఈ ఆరాధన కూడాను. ఆదినుండే ప్రవక్తలందరి షరీఅత్‌లలో ఫర్జ్‌గా ఉండింది. గతంలో ప్రవక్తల సమాజాలెన్నైతే ప్రపంచంలో వెలసిల్లాయో అవన్నీ అంతిమ దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) వారి సమాజంలో వలెనే రోజాలు పాటించేవి. అయితే రోజా నిబంధనలు, రోజాల సంఖ్య, రోజాలు పాటించే కాల వ్యవధుల్లో మాత్రం ఆయా షరీఅత్‌ల నడుమ తేడాలు ఉండేవి. నేటికీ అనేక మతాల్లో రోజా ఏదో ఓ రూపంలో ఉండడం మనం గమనిస్తూనే ఉన్నాం. అయితే ప్రజలు రోజాల్లో తమ సొంత విషయాలను ఎన్నో జొప్పించి అసలు రోజా స్వరూపాన్నే మార్చివేశారు. దైవగ్రంథం అయిన దివ్యఖుర్‌ఆన్‌లో ఇలా సెలవియ్యబడింది.

> *"యా అయ్యుహల్లజీన ఆమనూ కుతిబ అలైకుముస్సియాము కమా కుతిబ అలల్లజీన మిన్ ఖబ్లికుం"*
>
> *"ఓ ముస్లిములారా! గతంలో మీ పూర్వీకులపై ఎలాగయితే రోజా ఫర్జ్ చేయబడిందో అలాగే మీపై కూడా రోజా ఫర్జ్ చేయబడింది.*

అల్లాహ్ తరపున ఎన్ని షరీఅత్‌లయితే (ధర్మశాస్త్రాలు) వచ్చాయో అవి రోజా లాంటి ఆరాధన లేకుండా లేవు అని ఈ ఆయత్ ద్వారా తెలుస్తుంది. అల్లాహ్ ప్రతి కాలంలోను ఈ రోజాను ఫర్జ్ చేయడానికి, ఆ రోజాలో గల ప్రత్యేకత ఏమై ఉంటుంది? అన్న విషయాన్ని ఆలోచించండి! ఇస్లామ్ యొక్క

భాగాలను వదలివేయడం అసంభవం. అందరితో పాటు మిమ్మల్ని కూడా కట్టుదిట్టం చేయడం తప్పనిసరి అవుతుంది. ఈ కష్టాన్ని మనస్ఫూర్తిగా భరించడమే సహించరు. కాబట్టి మీరు కోరేదల్లా ఒక్కటే. ఈ గడియారం మాత్రం గోడపై అలంకారప్రాయంగా వ్రేలాడదీసి, ఎక్కడెక్కడినుండో ప్రజల్ని ఆహ్వానించి దాన్ని ప్రదర్శిస్తూ ఈ గడియారం ఇలాంటిది, అలాంటిది అని, ఇందులో ఫలానా ఫలానా చమత్కారాలు దాగి వున్నాయని చెప్పడమే. ఇంతకుమించి ఆ గడియారాన్ని ప్రేమించేవారు దీనికి ఈ పరిస్థితిలోనే 'కీ' ఇవ్వాలని, ఎంతో పకడ్బందీగా దాన్ని శుభ్రం చేస్తూ ఉండాలని కోరుకుంటూ ఉంటారు. కాని వాటి విడిభాగాల్ని సరిగ్గా బిగించాలని, బయటి భాగాలను తీసి పారేయాలని మాత్రం కోరుకోరు.

నేను మీ అభిప్రాయానికి ఏకీభవిస్తే ఎంత బాగుండేది! కాని నేనేం జేయగలను? నాకు తెలిసిన విషయాన్ని ఎలా కాదనను? ఏ పరిస్థితిలోనైతే మీరున్నారో ఆ పరిస్థితిలో మీరు అయిదుపూటల నమాజుకు తోడు 'తహజ్జుద్' 'ఇష్రాక్' మరియు 'చాష్త్' నమాజులు చేసినా, రోజుకు అయిదేసి గంటలు ఖుర్‌ఆన్ పారాయణం చేసినా, రమజాన్ నెలే కాకుండా ఇతర పదకొండు నెలల్లో అయిదున్నర నెలలు అదనంగా రోజాలు పాటించినా ఎలాంటి మార్పూ సంభవించదు. గడియారంలో దాని అసలు విడిభాగాలుండి, వాటిని సరిగా బిగిస్తే ఏ కొంచెం కీ అయినా దాన్ని నడిపించగలదు. కొంచెం శుభ్రం చేసినా, మరి కొంచెం నూనె పోసినా అది ఎంతో ఫలితాన్ని ఇస్తుంది. లేకపోతే మీరు మీ జీవితాంతం దానికి 'కీ' ఇస్తూనే ఉండండి. ఆ గడియారం నడిచేదిగాదు, నడువదు.

"వమా అలైనా ఇల్లల్ బలాగ్"

(స్పష్టపరచడం తప్ప మరేమీ మా బాధ్యత కాదు)

★ ★ ★

అందమైన గడియారంగానే అగుపడుతుంది. చూసేవాడు దీన్ని ఇస్లామ్ అనే అనుకుంటాడు. మిమ్మల్ని ముస్లిములుగానే భావిస్తాడు. మీరు ఈ గడియారానికి రోజా 'కీ' ఇస్తూ ఉండగా, శుభ్రంచేస్తుండగా దూరం నుండి చూసేవాడు మీరు నిజంగానే దీనికి కీ ఇస్తున్నారని, శుభ్రం చేస్తున్నారనీ అనుకుంటాడు. ఎవరూ మీ నమాజును నమాజుకాదని, మీ రోజాను రోజా కాదని అనరు. కాని చూసేవాళ్ళకు మాత్రం ఏం తెలుసు పాపం ఈ ప్రత్యక్షంగా కనబడే గడియారపు ఫ్రేములో మీరు ఏయే తతంగాలు చేసి పారేశారో?

ముస్లిమ్ సోదరులారా! ఈ ధార్మిక కార్యకలాపాలన్నీ ఎందుకు విఫలం అయిపోతున్నాయో అసలు కారణం వివరించాను. మీరు నమాజులు చేసినా, రోజాలు పాటించినా మీరంతా దేవుని సైనికులు అయ్యేబదులు తిరస్కారుల ఖైదీలుగా మారిపోతూ, అత్యాచారానికి బలైపోయే వారుగా మారిపోవటానికి కారణం మీకు తెలియ చేశాను. కాని మీరు బాధపడకుండా ఉంటే ఇంతకంటే విచారకరమైన మరో విషయాన్ని చెప్పదలుచుకున్నాను. మీకు మీ ఈ పరిస్థితి గురించిన బాధ ఎంతగా ఉన్నా, మీ కష్టాలకు సంబంధించిన అనుభవం ఎంత ఉన్నా మీలో వెయ్యి మందిలో తొమ్మిది వందల తొంభై తొమ్మిది మంది ఇంకా చెప్పాలంటే అంతకంటే ఎక్కువే ఈ పరిస్థితిని మార్చడానికి సిద్ధపడడం లేదు. ఎవరయితే ఇస్లామ్ అనే ఈ గడియారంలోని యంత్రభాగాలను విడదీశారో, ఇంకెవరయితే ఎవరికి తోచిన విడిభాగాల్ని వారు తీసుకొని వచ్చి ఇందులో బిగించారో వారంతా దీన్ని తిరిగి బాగుచేయడాన్ని సహించడం లేదు. ఎందుకంటే బయటి నుండి తీసుకొని వచ్చిన విడిభాగాల్ని తీసేస్తుంటే ప్రతి ఒక్కరికీ ఇష్టమైన యంత్రభాగాన్ని కూడా తీసివేయవలసి వస్తుంది. మీకు ఇష్టంలేని భాగాలను తీసేసి మీరు బిగించిన భాగాన్ని అట్టిపెట్టడం మాత్రం కుదరదు.

ఇదేవిధంగా గడియారపు విడిభాగాలన్నిటిని తిరిగి బిగిస్తే అన్నీ బిగించవలసిందే. ఇదేవిధంగా ఇతర భాగాలన్నీ బిగించి కేవలం మీకు ఇష్టమైన

పట్టించిన గతి మూలంగా మీరు మీ జీవితాంతం దానికి 'కీ' ఇస్తూ పోయినా, శుభ్రపరుస్తూ ఉన్నా, దానికి ఆయిలు అందిస్తూ ఉన్నా ఎలాంటి ఫలితాన్ని పొందలేరు అనేది నిజం. బయటి నుండి మీరు తీసుకొని వచ్చి బిగించిన విడి భాగాల్ని తీసి పారేసి దాని అసలు భాగాలను అందులో బిగించనంతవరకు సరి అయిన ఫలితాలను పొందలేరు.

బాగా తెలుసుకోండి! మీ నమాజులు, మీ రోజాలు, మీ జకాతు మరియు మీ హజ్‌లు నిష్ప్రయోజనంగా మారడానికి ఇదే అసలైన కారణం. మీలో నమాజులు చేసే వారు, రోజాలను పాటించేవారు, జకాత్ చెల్లించేవారు హజ్ చేసేవారు అసలు ఎంతమందున్నారని? జమాఅత్ వ్యవస్థ ఛిన్నాభిన్నం అవడం వల్ల ప్రతి వ్యక్తి తనకు తానే స్వతంత్రుడైపోయాడు. అతను తన విధుల్ని నిర్వర్తించినా, నిర్వర్తించకపోయినా అడిగే వాడే లేడు. అయితే మీలో వాటిని ఆచరించే వారు ఉన్నా వాటిని ఎలా ఆచరిస్తూ ఉన్నారు? నమాజులో జమాఅత్‌ను పాటించరు. ఎక్కడైనా జమాఅత్‌తో నమాజు చేసినా ఆ మస్జిదుల్లో ఇమామత్ కోసం ప్రపంచంలో మరే పనీ చేయలేని వారిని నియమించుకుంటారు. మస్జిదు సొమ్ముపై బ్రతికేవారు, ధార్మిక సేవను తమ ఉపాధిగా చేసుకున్న వారు, అజ్ఞానులు, పిరికిపందలు, నైతికంగా దిగజారిన వారినే మీరు మీ నమాజులకు ఇమాములుగా చేసుకుంటున్నారు. ఈ నమాజు మిమ్మల్ని దైవానికి ప్రతినిధులుగా ప్రపంచంలో దేవుని సైనికులుగా చేసేందుకు నియమింపబడింది. ఇదేవిధంగా రోజా, జకాత్, హజ్ పరిస్థితి కూడా దిగజారి పోయింది. అయినా మీరు నన్నడగవచ్చు. ఇప్పటికీ ముస్లిముల్లో తమ ధార్మిక విధుల్ని నిర్విర్తించేవారు చాలా మంది ఉన్నారు గదా అని. అయితే నేను పైన చెప్పినట్లు గడియారంలోని భాగాలన్నిటిని విడదీసి అందులో బయటినుండి ఎన్నో ఇతర భాగాల్ని జొప్పించి మీరు దానికి 'కీ' ఇచ్చినా ఇవ్వకపోయినా శుభ్రం చేసినా, చేయకపోయినా ఆయిలువేసినా, వేయకపోయినా ఇదంతా ఫలితం లేని వృధా ప్రయాసమాత్రమే. మీ ఈ గడియారం దూరం నుండి చూసే వారికి

స్థితిలో వుండి తద్వారా ఫలితమూ కన్పించాలి. కాని ఇక్కడ వ్యవహారమే తిరుగబడింది. మొదట ఆ గడియారపు విడిభాగాల్ని బిగించి ఉంచవలసిన ఆ జమాఅత్ వ్యవస్థే లేదు. ఫలితంగా వాటి స్క్రూలు వదులై ప్రతి విడిభాగం తన స్థానం నుండి కదిలిపడిపోయింది. ప్రతివాడూ తన ఇష్టం ప్రకారం నడుచుకుంటున్నాడు. అడిగేవాడే లేడు. ప్రతివ్యక్తీ స్వతంత్రుడయ్యాడు. ఇష్టమయితే ఇస్లామీయ చట్టాలకనుగుణంగా పనిచేస్తాడు లేకుంటే లేదు. ఇంత జరిగినా మీ గుండెలు చల్లబడలేదు. ఇస్లామ్ అనే ఈ గడియారం నుండి అనేక విడిభాగాలను ఊడదీసి వాటి స్థానంలో, మీలో ప్రతివాడు, తనకు నచ్చిన ఇష్టమైన రీతిలో ఇతర యంత్రాలనుండి విడిభాగాలను తీసుకొని వచ్చి గడియారంలో బిగించేశాడు. ఒకడు కుట్టు మిషనులోని ఓ విడిభాగాన్ని తీసుకొచ్చి ఫిట్ చేస్తే మరొకడు పిండిమరకు సంబంధించిన మరో విడిభాగాన్ని ఏరికోరి తెచ్చి ఫిట్ చేశాడు. ఇంకొకడు లారీకి సంబంధించిన యంత్రభాగాన్ని తెచ్చి బిగించాడు. ఇప్పుడు మీరంతా ముస్లిములే. అయినా బ్యాంకుల ద్వారా వడ్డీ వ్యాపారం నడుస్తూనే ఉంది. ఇన్స్యూరెన్స్ కంపెనీల్లో భీమా చేయిస్తున్నారు. ఇంగ్లీషువారి న్యాయస్థానాల్లో దొంగ కేసులూనడుపుతున్నారు. తిరస్కారుల్ని అనుసరిస్తూ వారి సేవలూ చేస్తున్నారు. కుమార్తెల్ని, చెల్లెండ్రను భార్యలను మేడమ్స్‌గా తీర్చి దిద్దుతున్నారు. సంతానానికి భౌతికపరమైన చదువును యిప్పిస్తున్నారు. గాంధీజీని కొందరనుసరిస్తుంటే లెనిన్ గారికి వంతపాడుతున్నారు మరికొందరు. మొత్తానికి ఇస్లామ్ అనే గడియారంలో మన ముస్లిమ్ సోదరులు తెచ్చి బిగించనటువంటి ఇస్లామేతర వస్తువు ఏదీ లేదు.

ఇంతా చేసి ఈ గడియారం దాని ఉద్దేశ్యం ప్రకారం ఫలితం చూపించాలని మీరు కోరుతున్నారు. శుభ్రపరచడం, ఆయిలు వేయడం, ఓవర్‌హాల్ చేయించడం ద్వారా కలగవలసిన లాభాలు కలగాలని మీరు ఆశిస్తున్నారు. కాని కొద్దిగా బుద్ధీ జ్ఞానాలను ఉపయోగించి ఆలోచిస్తే అర్థమైపోతుంది. మీరు ఈ గడియారానికి

అమలు జరగాలి. గడియారంలో ప్రతి భాగాన్ని పరస్పరం కలిపి ఉంచడానికి కొన్ని స్క్రూలు, పలుచటి బ్లేడులు ఉంచడం జరిగింది. ఇదే విధంగా ఇస్లామ్ అనే గడియారం యొక్క ప్రతి విడిభాగాన్ని ఓ క్రమంలో స్థిరంగా ఉంచడానికి ఓ వ్యవస్థఉంది. అదే 'జమాఅత్'వ్యవస్థ. అంటే ముస్లిములలో ఓ నాయకుడు అనేవాడు ఉండాలి, అతడు సరైన ధర్మజ్ఞానం, దైవభీతి కలిగిన వాడై ఉండాలి. జమాఅత్‌లోని మేధావులంతా అతనికి సహకారం ఇవ్వాలి. జమాఅత్‌లోని వారంతా అతని కాళ్లూ, చేతులుగా మారి అతన్ని అనుసరించాలి. వారందరి శక్తితో అతడు ఇస్లామ్ చట్టాలను అమలు పరచాలి. ప్రజలు ఆ చట్టాలను ఉల్లంఘించకుండా చూడాలి. ఇలా ఈ విడిభాగాలన్నీ పరస్పరం ఒకదానితో మరొకటి కలిసి వాటి క్రమం స్థిరపడిన తరువాత దాన్ని నిత్యం చలనంలో ఉంచడానికి 'కీ' ఇవ్వవలసి ఉంటుంది. ఆ 'కీ' యే మీరు అయిదు సార్లు చేసే ఈ నమాజు. ఆ తరువాత ఈ గడియారాన్ని శుభ్రం చేయవలసి ఉంటుంది. ఆ శుభ్రపరచడం అనేదే సంవత్సరం మొత్తంలో ముప్పై రోజులు మీరు పాటించే రోజాలు (ఉపవాస వ్రతాలు). ఇంకా ఆ గడియారానికి ఆయిల్ వేసే అవసరం కూడా ఉంది. కాబట్టి అది 'జకాత్'. ఇది సంవత్సరానికోమారు దానిలో ఉన్న విడిభాగాలకు ఇవ్వవలసి ఉంటుంది. ఈ ఆయిలు మరెక్కడ నుండో రాదు. ఆ గడియారంలోని కొన్ని భాగాలు తయారుచేసి కొన్ని అరిపోయిన భాగాలకు సరఫరా చేసి అది సునాయాసంగా నడిచేటట్లు చేస్తుంది. అప్పుడప్పుడు గడియారాన్ని 'ఓవర్‌హాల్' చేసే అవసరం కూడా ఏర్పడుతుంది. ఆ ఓవర్‌హాలింగే 'హజ్'. ఇది జీవితంలో ఓ మారు చేయాలి. అదనంగా ఎన్ని సార్లు చేస్తే అంతే మేలును చేకూరుస్తుంది.

ఇప్పుడు ఆలోచించండి! కీ ఇవ్వడం, శుభ్రపరచడం, నూనె పోయడం, ఓవర్‌హాల్ చేయడం వల్ల కావలసిన ప్రయోజనాలు కలగాలంటే గడియారంలోని భాగాలు ఉండాలి, అవి సరియైన కూర్పులోనూ ఉండాలి, కీ ఇవ్వగానె నడిచే

మేము మిమ్మల్ని ఒక 'మధ్యస్థ సమాజం'గా చేశాము. ఇకపై మీరు సమస్త మానవ జాతికి సాక్షులుగా ఉంటారు.

"వ అదల్లాహుల్లజీన ఆమనూ మిన్కుమ్ వ అమిలుస్సాలిహాతి లయస్తఖ్ లిఫన్నహుమ్ ఫిల్ అర్జ్" (నూర్ - 55)

మీలో విశ్వసించి మంచి పనులు చేసే వారికి అల్లాహ్ చేసిన వాగ్దాన మేమిటంటే, ఆయన వారిని, వారికి పూర్వం గతించిన ప్రజలను చేసిన విధంగా, భూమిపై ఖలీఫాలు (ప్రతినిధులు)గా చేస్తాడు.

"వ ఖాతిలూహుమ్ హత్తా లాతకూన ఫితనతుఁవ్ వ యకూనద్దీను కుల్లుహూ లిల్లాహ్" (అన్ఫాల్ - 39)

విశ్వసించిన ప్రజలారా! పీడన ఏ మాత్రం మిగలకుండా పోయేవరకు, అల్లాహ్ నిర్ణయించిన ధర్మం పూర్తిగా నెలకొల్పబడేవరకు ఈ అవిశ్వాసు లతో పోరాడండి.

ఈ ధ్యేయ పరిపూర్తికోసమే గడియారపు విడిభాగాల మాదిరిగా ఇస్లామ్లో కూడా అవసరమైన విడిభాగాలన్నిటిని ఓ చోట చేర్చడం జరిగింది. ధర్మ విశ్వాసాలు, నైతిక సూత్రాలు, పరస్పర సంబంధ బాంధవ్యాలు, దైవహక్కులు, దైవదాసుల హక్కులు, మనిషియొక్క హక్కులు, మనిషికి తారసపడే ప్రపంచంలోని ప్రతి వస్తువు యొక్క హక్కులు, సంపాదించే నియమాలు, ఖర్చుపెట్టే తీరుతెన్నులు, యుద్ధం, చట్టాలు, సంధి సూత్రాలు పరిపాలనా చట్టాలు, ఇస్లామీయ ప్రభుత్వానికి విధేయత చూపే తీరు ఇవన్నీ ఇస్లాం యొక్క విడిభాగాలే. వాటన్నిటిని గడియారపు విడిభాగాల్లా ఓ క్రమ పద్ధతిలో ఎలా బిగించడం జరిగింది. 'కీ' ఇవ్వగానే ప్రతి భాగం మరో భాగంతో కలిసి కదల నారంభిస్తుంది. ఆ కదలిక అసలు ఫలితం 'డైల్'పై సమయం ప్రతి ఫలించినట్టు వ్యక్తం కావాలి. అంటే ఇస్లామ్ యొక్క ఆధిక్యత, ప్రపంచంలో దైవ శాసనాల

అతడు మాత్రం ఇది గడియారంలాగే ఉందనుకొని గడియారం వల్ల ఏ ప్రయోజనం అయితే లభిస్తుందో దాన్నే ఆశిస్తాడు. మీరు దానికి కీ ఇవ్వగా అతడు దూరం నుండి చూసి మీరు కీ ఇస్తున్నారనే అనుకుంటాడు. ఈ కీ వల్ల ఏ ఫలితం అయితే రావాలో అదే ఆశిస్తాడు కూడా. అయితే అది చూడటానికే గడియారం కాని, అందులో గడియారానికి ఉండవలసిన గుణం ఏదీ లేనప్పుడు ఆ ఆశ ఎలా నెరవేరుతుంది?

నేను మీ ముందుంచిన ఈ ఉపమానం ద్వారా మీరు పూర్తి విషయాన్ని గ్రహించే వుంటారు. ఇస్లామ్ కూడా ఈ గడియారం లాంటిదే అనుకోండి. గడియారం ధ్యేయం సరైన సమయాన్ని చూపించడం. అదే విధంగా ఇస్లామ్ ధ్యేయం ప్రకారం మీరు ఈ భూమ్మీద దైవ ప్రతినిధులు. మానవాళి సమక్షంలో దైవం తరపున సాక్షులు. మీరు ఈ భూమ్మీద సత్యధర్మ ధ్వజవాహకులు. స్వయంగా దైవాజ్ఞలపై నడుస్తూ, అందరిని దైవాదేశాలకనుగుణంగా నడిపేవారు. అందరిని దైవశాసనబద్ధులుగా తీర్చిదిద్దేవారు. ఈ ధ్యేయం గురించి దివ్యఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది :

> *"కుంతుమ్ ఖైర ఉమ్మతిన్ ఉఖ్రిజత్ లిన్నాసి త'మురూన బిల్ మారూఫి వ తన్'హౌన అనిల్ మున్కరి వ తూమినూన బిల్లాహ్"*
>
> *(ఆలి ఇమ్రాన్ -110)*
>
> *ఇక నుండి ప్రపంచంలో మానవులకు మార్గం చూపటానికీ, వారి సంస్కరణకూ రంగంలోకి తీసుకురాబడిన ఉత్తమ సమాజం మీరే. మీరు మంచిని చెయ్యండి అని ఆజ్ఞాపిస్తారు. చెడునుండి ఆపుతారు. అల్లాహ్‌ను విశ్వసిస్తారు.*
>
> *"వకజాలిక జఅల్‌నాకుం ఉమ్మతఁవ్ వసతల్ లితకూనూ షుహదాఅ అలన్నాస్"* *(బఖరా -143)*

యంత్రంలో కూర్చబడ్డ విడిభాగాలన్నీ సరైన సమయాన్ని చూపించడానికి పనికివచ్చేవే. వాటన్నిటిని బిగించింది అన్నీ కలిసి ఓ క్రమ పద్ధతిలో సరైన సమయం చూపించేందుకే. ఏ విడిభాగం ఎంత మట్టుకు పనిచేయాలో అంత వరకే పని చేయాలి, ఆ తరువాత దానికి, ఆ భాగాలన్ని ఆగకుండా ఉండేందుకు ఓ నిర్ణీత సమయంలో 'కీ' ఇచ్చే నియమం పెట్టబడింది. ఇలా విడిభాగాలన్నిటిని ఖచ్చితంగా బిగించడం, సమయానికి 'కీ' ఇవ్వడం ద్వారా గడియారం ఏ లక్ష్య సాధనకోసం తయారు చేయబడిందో ఆ లక్ష్యాన్ని నెరవేర్చగలుగుతోంది. ఒకవేళ మీరు దానికి 'కీ' ఇవ్వకపోతే అది సమయాన్ని చూపించదు.

అదేవిధంగా, మీరు దానికి 'కీ' అయితే ఇస్తున్నారుగాని దానికోసం నిర్ణయించిన పద్ధతి ప్రకారం ఇవ్వకుంటే అది ఆగిపోతుంది. అది నడిచినా సరైన సమయాన్ని చూపించదు. అలాగే దానిలోని కొన్ని విడిభాగాల్ని తీసేసి 'కీ' ఇస్తే ఈ 'కీ' వలన ఎలాంటి ప్రయోజనం చేకూరదు. అదే విధంగా మీరు దాని విడి భాగాల్లో నుండి కొన్నిటిని తొలగించి వాటిస్థానే కుట్టుమిషను విడిభాగాల్ని అమర్చారనుకోండి. ఆ తరువాత 'కీ' కూడా ఇచ్చారనుకోండి. అప్పుడు అది ఇటు సమయాన్నీ చూపించదు అటు బట్టలూ కుట్టలేదు. అలాగే మీరు దానిలో వున్న విడిభాగాలన్నింటిని అందులోనే ఉంచేసి వాటిని ఒకదాన్ని మరో దానితో వేరుచేసి 'కీ' ఇవ్వండి. మీరు ఇచ్చిన ఆ 'కీ' వల్ల ఏ ఒక్క విడిభాగం కూడా కదలదు. ఉంటానికి గడియారం భాగాలన్నీ అందులోనే ఉన్నాయి. కాని అవి అందులో ఉండడం వలన గడియారం ఏ ధ్యేయం కోసమయితే తయారుచేయబడిందో ఆ ధ్యేయం నెరవేరదు. ఎందుకంటే వాటి కూర్పు, సంబంధాన్ని మీరు త్రుంచేశారు. అందుకే అవన్నీ కలసి కదల్లేవు. నేనిప్పుడు వివరించిన విషయాలన్నిటిలో, గడియారపు అస్థిత్వం, దానికి 'కీ' ఇచ్చే విధానం అన్నీ నిష్ప్రయోజనం అయిపోతాయి. కాని, దూరం నుండి చూసేవాడు, అది గడియారం కాదని, మీరు దానికి 'కీ' ఇవ్వడం లేదని మాత్రం అనుకోడు.

# నమాజుల్లో ప్రభావం లేదు ఎందుకు?

ముస్లిమ్ సోదరులారా! వరుసగా ఎన్నో ప్రసంగాల్లో నమాజుకు సంబంధించిన ఇన్ని ప్రయోజనాలను చెప్పుకుంటూ వచ్చానే, ఆ నమాజు ఇప్పుడు ఆ ప్రయోజనాలను మనకు ఎందుకు చేకూర్చిపెట్టడం లేదు? మీరు నమాజులు చేస్తూనే వున్నారుగాని మీ జీవితం ఎందుకు చక్కబడటం లేదు? మీ ప్రవర్తన ఎందుకు పరిశుద్ధం కావడం లేదు? ఇప్పటికినీ మీరు దేవుని బలమైన సైన్యంగా ఎందుకు మారడం లేదు? తిరస్కారులు మీపై ఎందుకు ఆధిక్యత కలిగి వున్నారు? మీరు ప్రపంచంలో దీనావస్థకు, పరాధీనతకు ఎందుకు గురై వున్నారు?

ఈ ప్రశ్నకు క్లుప్తమయిన సమాధానం ఏమిటీ అంటే మీరు అసలు నమాజే చేయరు, చేసినా దైవప్రవక్త (సఅసం) చూపించిన రీతిలో చేయరు. కాబట్టి ఓ విశ్వాసిని పరిపూర్ణుడుగా చేసే నమాజు ద్వారా లభించవలసిన ప్రయోజనాలను మీరు ఆశించలేరు. నా ఈ సమాధానం మిమ్మల్ని సంతృప్తి పర్చ లేదన్నది కూడా నాకు తెలుసు. దీనిని కొంచెం వివరంగా విడమర్చి చెబుతాను.

ఈ గోడ గడియారాన్ని చూశారు గదా. ఇందులో అనేక భాగాలు ఉన్నాయి. ఇవి ఒకదానితో మరొకటి గట్టి సంబంధం కలిగిఉన్నాయి. గడియారానికి 'కీ' ఇవ్వగానే ఆ భాగాలన్నీ తమ తమ పనులు చేయనారంభిస్తాయి. అవి అలా కదలగానే బయట మనకు కనబడే తెల్లని ఫలకం (డైల్) పై ఆ కదలికల ఫలితం గోచరిస్తూ ఉంటుంది. అంటే గడియారపు ముల్లు కదులుతూ ఒక్కొక్క సెకను, ఒక్కొక్క నిమిషాన్ని చూపిస్తాయి అన్నమాట. ఇప్పుడు మీరు నిశితంగా ఆలోచించండి. గడియారం తయారు చేయబడింది ఎందుకు? అది సరైన టైమును (సమయాన్ని) చూపించడానికే కదా! అందుకనే గడియారం అనే

స్పష్టమయిన పాపపు కార్యానికి పాల్పడితే జమాఅత్ 'విధిగా' తమ నమాజును భంగపరచి ఆ ఇమామ్ నుండి వేరై పోవాలి.

ఈ విధానం ద్వారా, మీరు మీ జాతీయ జీవనంలో మీ సర్దారు లేక మీ నాయకుని ఎడల ఎలా ప్రవర్తించాలో బోధించడం జరిగింది.

ముస్లిమ్ సోదరులారా! రోజుకు అయిదుసార్లు కేవలం కొన్ని నిమిషాల కొరకు మీరు చేసే ఈ ఆరాధనలో అల్లాహ్ ఇహపర లోకాలకు సంబంధించిన ఎన్ని మేళ్ళు ఈ సామూహిక నమాజులో సమకూర్చి పెట్టాడో గమనించే ఉంటారు. ఈ ఆరాధన ఒక్కటే మీకు ఎన్ని శుభాలను అందజేస్తోందో, మిమ్మల్ని అల్లాహ్ దాస్యం కోసం, ప్రపంచ పరిపాలన కోసం ఎలా సమాయత్త పరుస్తోందో తెలుసుకొని ఉంటారు. అయితే మీరొక ప్రశ్నను తప్పక అడుగుతారు - నమాజులో నీవు చెప్పిన ఇలాంటి శక్తి దాగుంటే మరి అది మనకు ప్రాప్తం కాదేమిటి? అని. ఇన్షాఅల్లాహ్ దీనికి సమాధానం తరువాతి ప్రసంగాల్లో ఇచ్చే ప్రయత్నం చేస్తాను.

★ ★ ★

నమాజులో ఇమామ్‌ను కచ్చితంగా అనుసరించాలి అని ఆదేశించడం జరిగింది. ఇమామ్ కంటే ముందే రుకూ సజ్దాలు చేయడం లేక నమాజు ముగించడం నిషిద్ధం. ఎవరైతే అలా చేస్తారో వారి గురించి హదీసులో, అలాంటి వ్యక్తి అంతిమ దినం నాడు గాడిద రూపంలో లేపబడతాడు అని ఉంది. ఇక్కడ నాయకుని ఆజ్ఞాపాలన ఎలా చేయాలో జాతికి బోధించబడింది.

ఇమామ్ గనక నమాజులో తప్పు చేస్తే , ఉదాహరణకు లేచి నిలబడవలసిన చోట కూర్చుంటే, కూర్చోవలసి వచ్చినప్పుడు లేచినిలబడితే "సుబ్‌హానల్లాహ్" అని పలికి హెచ్చరించాలి. సుబ్‌హానల్లాహ్ అంటే అల్లాహ్‌యే పరిశుద్ధుడు అని అర్థం. అంటే తప్పు చేయనివాడు కేవలం ఆయన ఒక్కడే; నీవు కేవలం మానవ మాత్రుడివి. నీచేత తప్పు దొర్లడం ఆశ్చర్యకరమైన విషయం కాదు అని హెచ్చరించడం. ఇది ఇమామ్‌ను తన తప్పును సరిదిద్దుకోమని చెప్పే విధానం. చేసిన తప్పును గురించి హెచ్చరించినపుడు ఇమామ్ ఏ మాత్రం సిగ్గుపడకుండా తన తప్పును సరిదిద్దుకోవాలి. అయితే అలా హెచ్చరించినా, ఇమామ్ తాను చేసింది తప్పు కాదని పూర్తి నమ్మకంతో ఉంటే, అతడు తన నమ్మకం ప్రకారం నమాజు పూర్తి చేయవచ్చు. అలాంటి సమయంలో వెనుకవున్న వారు ఆ తప్పును తప్పుగా భావిస్తూనే ఇమామ్‌ను అనుసరించాల్సి ఉంటుంది. నమాజు పూర్తి అయిన పిదప ఇమామ్ చేసిన తప్పును రుజువు పరిచే హక్కు ముక్తదీలకు ఉంది. అలా రుజువు చేసి, తిరిగి నమాజు చేయించమని అతణ్ణి కోరవచ్చు.

ఇమామ్ ఎడల ఇలాంటి వైఖరి అవలంబించేది చిన్న చిన్న విషయాల్లోనే. అయితే ఇమామ్ గనక దైవప్రవక్త (సఅసం) సంప్రదాయానికి భిన్నంగా నమాజు విధానాన్నే మార్చివేస్తే లేక నమాజులో కావాలని దైవగ్రంథాన్ని తప్పుగా పారాయణం చేస్తే లేక నమాజు చేయించేటప్పుడు తిరస్కారం బహుదైవారాధనకు లేక

ఉండటం సాధ్యమే. కాని జమాఅత్‌లో చాలామంది ఇష్టపడని వ్యక్తిని ఇమామ్‌గా నియమించరాదు. ఇక్కడ మళ్ళీ జాతి నాయకుణ్ణి ఎన్నుకునే నియమాన్ని తెలుపడం జరిగింది.

మరో ఆదేశం ప్రకారం ఎవరైతే జమాఅత్ యొక్క ఇమామ్‌గా నియమించబడతాడో అతడు చేయించే నమాజు వల్ల వయస్సు మళ్ళిన వారికి కూడా బాధకలగకుండా ఉండాలి. కేవలం యువకులు, శరీర దారుఢ్యంగల వారు, ఆరోగ్యవంతులు, తీరికగల వారినే దృష్టిలో ఉంచుకుని సుదీర్ఘమైన ఖిరాఅత్ (ఖుర్‌ఆన్ పఠనం), సుదీర్ఘమైన రుకూ సజ్దాలు చేయరాదు. జమాఅత్‌లో వృద్ధులు, రోగగ్రస్తులు, బలహీనులు కూడా ఉంటారు, అదే విధంగా నమాజు త్వరగా ముగించుకొని తమ పనిపాటల్లోకి వెళ్ళే వాళ్ళుంటారు అనే విషయాన్ని దృష్టిలో వుంచుకుని నమాజు చేయించాలి. దైవప్రవక్త (సఅసం) ఈ విషయంలో ఎంత జాలి కలిగి ఉండేవారంటే నమాజు చేయించేటప్పుడు ఏ పసిపాప ఏడ్చినా జమాఅత్‌తో నమాజు చేస్తున్న ఆ పసిపాప తల్లికి బాధకలగకుండా నమాజును క్లుప్తంగా ముగించే వారు. అది ఆయన మనకు చూపిన ఓ నమూనా. అంటే జాతికి ఎన్నుకోబడ్డ నాయకుడు, ఆ జాతి ఎడల ఎలాంటి వైఖరి అవలంబించాలో దీని ద్వారా బోధించడం జరిగింది.

నమాజు చేయించేటప్పుడు ఇమామ్‌కు ఏదైనా అవాంతరం ఏర్పడి తాను ఇమామత్ చేయడానికి అనర్హుడయ్యే పరిస్థితి ఏర్పడితే తన స్థానం నుండి తప్పుకొని తన వెనుక నిలబడి వున్న వ్యక్తిని ఆ స్థానంలో నిలబెట్టాలి అనే ఆదేశం ఉంది. అంటే జాతికి నాయకుడైన వాడు కూడా తాను నాయకత్వానికి అర్హుడు కాను అని తలచినప్పుడు వెంటనే ఆ నాయకత్వం నుండి తప్పుకొని తనకంటే సమర్థుడైన వానికోసం ఆ స్థానాన్ని ఖాళీచేయాలి. ఇందులో స్వార్థానికి గాని, సిగ్గుపడడానికిగాని ఎలాంటి ఆస్కారం ఉండకూడదు.

జమాఅత్ అంటూ ఏర్పడిన తరువాత దాన్నుండి విడిపోవడం అంటే మీ జీవితం ముస్లిమ్ జీవితమే కాదు అని చెప్పడం అన్నమాట.

ఈ విషయం ఇంతటితో ముగియదు. మస్జిద్‌లో ఇమాం మరియు ముక్తదీల సంబంధం ఏర్పరచడం ద్వారా ఈ చిన్నపాటి మస్జిద్ వెలుపల ప్రపంచం అనబడే ఆ మహోన్నత మస్జిద్‌లోను మీకు ఇమామ్‌తోగల సంబంధం ఏమిటో తెలుపటం జరిగింది. ఈ ప్రపంచం అనబడే పెద్ద మస్జిద్‌లో మీ ఇమామ్ (నాయకుడు) యొక్క విధులేమిటి, అయన హక్కులేవీ? మీరాయనకు ఎలా విధేయత చూపాలి; ఏ విషయాల్లో విధేయత చూపాలి? అతడు ఏదైన తప్పు చేస్తే మీరేం చేయాలి? ఎంతవరకు అతణ్ణి అనుసరించాలి? ఆయన ఏ తప్పుల్ని మీరు ఎత్తి చూపొచ్చు? ఏ సందర్భంలో తన తప్పును దిద్దుకోమని అయన్ను డిమాండు చేయొచ్చు? మరే సందర్భంలో మీరాయన్ని ఇమామత్ (నాయకత్వం) నుండి తొలగించవచ్చు అన్న విషయాలు తెలుసుకునేలా ఈ జమాఅత్ స్థాపించబడింది. రోజుకు అయిదుసార్లు ప్రతి చిన్న మస్జిద్‌లో ఓ గొప్ప సామ్రాజ్యాన్ని నడపగలిగే అభ్యాసం చేయించడం అన్నమాట ఇది. ఇక్కడ నేను ఆ వివరాలన్నింటిని చెప్పే అవకాశం లేదు, అయినా స్థూలంగా కొన్ని విషయాలను మాత్రం చెబుతాను.

ఇమామ్ దైవభీతి కలిగిన వాడు, జ్ఞానంలో అందరికంటే అధికుడు, ఖుర్‌ఆన్ బాగా తెలిసినవాడై వయస్సులో అందరికంటే పెద్దవాడు అయి ఉండాలన్నది ఆదేశం. హదీసులో, ఈ గుణగణాల్లో ఏది దేనికంటే గొప్పది అన్న క్రమం కూడా చెప్పబడి ఉంది. దీని ప్రకారం జాతికోసం ఎన్నుకోబడే నాయకునిలో ఏయే గుణగణాలుండాలో తెలిసిపోతుంది.

మరో ఆదేశం ప్రకారం జమాఅత్‌లోని ఎక్కువ మందికి ఇష్టంలేని వ్యక్తి ఇమామ్‌గా చలామణి కావడానికి వీల్లేదు. ఎవరికైనా కొద్దో గొప్పో వ్యతిరేకత

"ఇయ్యాక న' అబుదు వ ఇయ్యాక నస్తయీన్" (మేమంతా నిన్నే ఆరాధిస్తాము, నీ సహాయాన్నే వేడుకుంటాము), "ఇహ్దినస్సిరాతల్ ముస్తకీమ్" (ఓ ప్రభూ మాకు రుజు మార్గాన్ని చూపించు), రబ్బనా లకల్‌హంద్ (ఓ ప్రభూ సర్వస్తోత్రాలు నీకే) అస్సలాము అలైనా వ అలా ఇబాదిల్లాహిస్సాలిహీన్, (మాపైనా, దైవదాసులైన సజ్జనులపైనా శాంతి కురియుగాక) అని పలుకుతాం. ఆ తరువాత నమాజు ముగించుకొని ఒకరికొకరు దైవ కారుణ్యంకోసం, శుభశాంతులకోసం దుఆ చేస్తూ అస్సలాము అలైకుం వరహ్మతుల్లాహ్ అని అంటాం. అంటే మీరంతా పరస్పరం ఒకరి హితాన్ని మరొకరు కోరుకునే వారన్నమాట. అంతా కలిసి అందరి మేలు కొరకు ఒకే ప్రభువును వేడుకుంటారన్న మాట. మీరు ఒంటరి వారు కారు. మీలో ఏ ఒక్కడూ తన కోసమే అంతా కోరుకోడు. ప్రతి వ్యక్తి దుఆ అందరిపై దైవకారుణ్యం కలగాలన్నదే. దైవం అందరిని ఒకే రుజుమార్గంపై నడిపించే భాగ్యం కలుగజేయాలన్నదే. అందరూ దైవ కటాక్షానికి అర్హులు కావాలనే కోరుకుంటాడు. ఇలా ఆ నమాజు మీ హృదయాలను పరస్పరం కలుపుతుంది. మీ ఆలోచనల్లో సమత్వాన్ని పుట్టించి, మిమ్మల్ని పరస్పరం శ్రేయోభిలాషుల్లా చేస్తుంది.

అయితే మీరు జమాఅత్ నమాజు (సామూహిక నమాజు) ఇమాం లేకుండా ఎన్నటికీ చేయరు. ఇద్దరు కలసి నమాజు చేసినా ఒకడు ఇమామ్ (నాయకుడు)గాను మరొకడు ముక్తదీ (అనుసరించేవాడు) గాను ఉండాల్సిందే. జమాఅత్ నమాజు మొదలైతే దాన్ని వదలి ఒంటరిగా నమాజు చేయడం నిషిద్ధం. అసలు ఆ నమాజు నెరవేరదు కూడాను. మస్జిద్‌లోకి వచ్చే ప్రతి వ్యక్తి ఆ ఇమామ్ వెనుకనే జమాఅత్‌లో చేరిపోతూ వుండాలని ఆదేశం. ఇవన్నీ కేవలం నమాజు కొరకే కాదు వాటిలో మీకు, ముస్లిములుగా జీవితం గడపడానికి ఇలానే సామూహికంగా కలిసి జీవించాలి అనే ఉపదేశం వుంది. మీకు ఓ నాయకుడంటూ లేకపోతే మీ జమాఅత్ (సముదాయం) జమాఅత్ కానే కాదు;

అందరూ కలిసి సామూహికంగా నమాజు చేయడంలో ఎన్ని శుభాలు దాగి ఉన్నాయో ఆలోచించారా? మీరంతా ఒకే వరుసలో ఒకరి ప్రక్క నొకరు భుజానికి భుజం ఆనించి నిలబడతారు. అక్కడ ఒకరు అధికులు అని గాని మరొకరు అల్పులు అని గాని తారతమ్యం ఉండదు. ఒకరు ఉన్నతులు మరొకరు నీచులు కారు, దైవసన్నిధిలో, దైవం ఎదుట అందరూ ఒకేస్థాయికి చెందినవారు. ఒకరి చేయి తాకితే మరొకరు అపవిత్రులు కారు. అందరూ పవిత్రులే. అందరూ జన్మతః మానవులే, ఒకే దైవానికి దాసులు, ఒకే ధర్మాన్ని అవలంబించేవారు. మీలో వంశాలు, వర్గాలు, తెగలు, జాతులు, భాషలకు సంబంధించిన భేదభావాల్లేవు. ఒకరు సయ్యదులైతే మరొకరు పఠానులు. ఒకరు రాజపుత్రులయితే మరొకరు జాట్లు. ఎవరు ఏ దేశానికి చెందిన వారైనా, ఏ భాష మాట్లాడినా అందరూ ఒకే వరుసలో నిలబడి ఆ దైవాన్నే ఆరాధిస్తారు. అంటే మీరంతా ఒకే జాతి అని అర్థం. ఈ వంశం, వర్గం, తెగ, జాతి లాంటి భేద భావాలు అన్నీ అసత్యాలే. అన్నింటికంటే మీ నడుమ వున్న మరో గొప్ప సంబంధం దైవారాధన మరియు దైవదాస్య సంబంధం. మీరంతా ఒక్కటే అయినప్పుడు మరే విషయంలోనైనా విభేదాలు దేనికి?

మీరంతా ఒకే వరుసలో భుజానికి భుజం అనించి నిలబడినప్పుడు ఓ సైన్యపటాలం తన పాలకుని ఎదుట బారులుదీరి అయన సేవకోసం నిలబడిందా అన్నట్లు గోచరిస్తుంది. అలా బారులు తీరి నిలబడడం అందరూ కలిసి ఒకే రకంగా కదలడం మూలంగా మీలో సమైక్యత జనిస్తుంది. మీకు చేయించే అభ్యాసంలో దైవదాస్యంలో ఇలా అంతా కలిసి మీ చేతులన్నిటినీ ఒకేసారి పైకి లేపాలి, మీ కాళ్ళు ఒకేసారి కదలాలి, అంటే మీరు పదిమందో, ఇరవై మందో, వందమందో లేక వెయ్యిమందో కాదు అందరూ కలిసి ఒకే వ్యక్తిలా మారిపోవాలి.

మీరంతా మస్జిద్‌లో సమావేశమై బారులు తీర్చి దైవ సమక్షంలో నిలబడ్డారు. ఆ తరువాత మీరేం చేస్తారు? ముక్త కంఠంతో మీ ప్రభువును

బక్కచిక్కినవారు ధనవంతుల వద్దకు చేరి తమ పరిస్థితిని ఏకరువు పెట్టుకునే ధైర్యం కలుగుతుంది. ఎవరైనా అనారోగ్యానికి గురైనా, కష్టాల్లో చిక్కుకున్న కారణంగా మస్జిద్‌కు రాలేకపోతే అలాంటి వారిని పరామర్శించడానికి వెడదాము అన్న ఆలోచనా కలుగుతుంది. ఎవరైనా చనిపోయాడు అన్న వార్త అందితే అందరూ కలిసి అతని అంత్యక్రియల్లో పాల్గొని జనాజా నమాజు చేసి ఆ మృతుని ఇంటి వారి దుఃఖంలో పాలుపంచుకునే వీలూ కలుగుతుంది. ఈ విషయాలన్నీ మీలో పరస్పర ప్రేమానురాగాలను పెంపొందించుకుని ఒకరికొకరు సహాయసహకారాలు అందించుకోవడానికి ఉపయోగపడేవే.

ఇంకొంచెం లోతుగా ఆలోచిస్తే, ఓ పవిత్ర స్థలంలో ఓ పవిత్రమైన ధ్యేయంతో మీరంతా ఓ చోట సమావేశమయ్యారు కదా! ఇది జూదగాళ్ళు, త్రాగుబోతులు, దొంగలు లూటీకోర్ల సమావేశం కాదు అందరి మనస్సుల్లో అపవిత్ర భావాలు ఉండడానికి. ఇది దైవదాసుల సమావేశం. అది కూడా అల్లాహ్ ఆరాధన కోసం, అల్లాహ్ గృహం అయిన మస్జిద్‌లో, అందరూ తమ దైవం ఎదుట ఆయన దాస్యాన్ని ప్రకటించడానికి హాజరయ్యారు. ఇలాంటి సందర్భంలో ఓ విశ్వాసి స్వయంగా తన పాపాల గురించి సిగ్గుపడతాడు. అయితే అతడు ఆ పాపాన్ని ఇతర సోదరుడు చూడగా చేస్తే, ఆ సోదరుడు కూడా ఆ మస్జిద్‌లోనే అతనికి తారసపడితే అతని చూపు కలవడమే తడవు ఆ పాపం చేసినవాడు తనలో తానే కుమిలిపోతాడు. ఒకవేళ ముస్లిముల్లో ఒకరికి ఒకరు సద్బోధ చేసే భావన ఉండి, ఒకరిని చూసి ఒకరు ఎలా సరిదిద్దుకోవాలో అనే విషయాన్ని కూడా వారు తెలుసుకొని ఉంటే ఇలాంటి సమావేశం ఎంతో కారుణ్యప్రదమైన, శుభప్రదమైన సమావేశంగా మారగలదు. ఇలా ముస్లిములంతా కలిసి ఒకరి చెడుగులను మరొకరు సరిదిద్దుకోగలరు. ఇలా పూర్తి సంఘమే సజ్జనుల సంఘంగా మారి పోగలదు.

ఇవి కేవలం మస్జిద్‌లో సమావేశం అయినందుకు కలిగే శుభాలు.

అందుకే రాయితీ కల్పించి కేవలం రోజుకు అయిదుసార్లు మాత్రమే దైవ శంఖారావం 'అజాన్' పిలుపుపై పరుగు పరుగున వచ్చి దైవ సైన్యశిబిరం అయిన మస్జిద్‌లో సమావేశమయ్యేందుకు ఆదేశించబడింది.

ఇది కేవలం ఒక అజాన్ ప్రయోజనం మాత్రమే. ఇక మీరు మస్జిద్‌లో సమావేశం అవుతారు. ఇలా సమావేశం అవడంలోనే మీకు అనేక ప్రయోజనాలు ఒనగూడుతాయి. ఇక్కడ మీరు సమావేశమైనప్పుడు ఒకరినొకరు చూస్తారు, పలుకరించుకుంటారు, గుర్తిస్తారు. అయితే ఈ చూడ్డం, గుర్తించుకోవడం, పలుకరింపు ఏరూపంలో జరుగుతుంది? మీరంతా ఒకే దైవదాసులని, మీరంతా ఒకే ప్రవక్త అడుగుజాడల్లో నడుచుకునేవారని, ఒకే గ్రంథాన్ని విశ్వసిస్తున్నారని, ఒకే ఒక ధ్యేయం మీ జీవన ధ్యేయమనే కదా! ఆ ధ్యేయాన్ని, ఆ లక్ష్యాన్ని నెరవేర్చడానికే గదా మీరంతా ఇక్కడ చేరింది! మీరంతా ఇక్కడ నుండి బయటికి వెళ్ళి అక్కడా, మీరు ఈ ధ్యేయాన్నే నెరవేర్చాల్సి ఉంది. ఈ మైత్రి, ఒకరినొకరు అర్థం చేసుకోవడం అనేది, మీరంతా ఒకే జాతి అని, ఒకే సైన్యానికి చెందిన సిపాయిలని, మీరంతా పరస్పరం సోదరులని, ప్రపంచంలో మీ అవసరాలు, మీ ధ్యేయాలు మీ లాభనష్టాలు అన్నీ ఉమ్మడివే అని, మీ జీవితాలు ఒకరితో ఒకరికి ముడిపడి ఉన్నాయి అన్న ఆలోచనలను రేకెత్తిస్తాయి మీలో.

ఆ తరువాత మీరు చూసే ప్రతి చూపు, ఓ మిత్రుడు మిత్రుణ్ణి చూసినట్లు, ఓ సోదరుడు సోదరుణ్ణి చూసినట్లుగానే ఉంటుంది తప్ప ఓశత్రువు శత్రువును చూసినట్లుగాదు. ఈ చూపులతో మీరు, నా ఫలానా సోదరుడు ఏదో బాధలో ఉన్నాడట్లుంది, ఫలానా వాడు చింపిరి గుడ్డలతో ఉన్నాడు, ఫలానా వాడు ఆకలితో ఉన్నాడు, ఒకడు వికలాంగుడు, మరొకడు గ్రుడ్డివాడు అన్న దృష్టితో చూస్తే అనుకోకుండా మీ హృదయంలో వారిఎడల దయా, జాలి ఏర్పడ తాయి. మీలో స్తోమత గలవారు పేదల్ని, అనాధల్ని ఆదుకుంటారు. ఆర్థికంగా

సైనికుడు ఎక్కడున్నా 'బిగిల్' విన్నంతనే, వారి కమాండరు వారిని పిలుస్తున్నాడు అని అనుకుంటాడు. ఆ పిలుపువల్ల అందరి మనస్సుల్లోను ఒకే ఆలోచన పొడసూపుతుంది. అంటే కమాండరు ఆదేశాలను అనుసరించే ఆలోచన అన్న మాట. ఈ ఆలోచనకు అనుగుణంగా అందరూ ఒకే తీరుగా ప్రతిస్పందిస్తారు.

అన్ని వైపుల నుండి వచ్చి ఒకే ప్రదేశంలో కూడుతారు. సైన్యంలో ఈ పద్ధతిని ఎందుకు ప్రవేశపెట్టబడినట్లు? ప్రతి సైనికునిలో వేరువేరుగా ఆజ్ఞల్ని పాలించి, దానిపై చురుకుగా అమలు చేసే గుణం మరియు అలవాటు పడాలనేది ఒకటైతే, దానికి తోడు ఆ విధేయులైన సిపాయిలంతా కలిసి ఓ గ్రూపుగా, ఓ వర్గంగా ఓ టీముగా తయారవడం మరొకటి. అవసరమైతే కమాండర్ ఆదేశానికి ఒకే సమయంలో ఒకేచోట కూడి ఒకే లక్ష్యానికి కృషి చేయగలగాలి. అలాకాక ఒక్కొక్క సైనికుడు శూరుడే అయినా, అవసరం ఏర్పడ్డప్పుడు వారిని పిలిస్తే ఓ చోటకు చేరి యుద్ధం చేయలేకపోతే, వారంతా తమ ఇష్టానుసారం ఎటుబడితే అటు వెళ్ళిపోతే, ప్రయోజనమేమిటి? ఇలాంటి పరిస్థితే ఓ సైనిక పటాలానికి వస్తే దాని వెయ్యిమంది శూరుల్ని శత్రు సైన్యానికి చెందిన ఓ యాభైమంది పట్టేసి సంహరించగలరు. అచ్చంగా ఈ సూత్రం పైన్నే ముస్లిముల కోసం ఓ విధానం ఏర్పర్చబడింది. ముస్లింలు ఎక్కడున్నా సరే అజాన్ పిలుపు వినగానే పనులన్నిటిని వదిలేసి దగ్గరి మస్జిద్ వైపునకు వెళ్ళాలి, తద్వారా ముస్లిములంతా అల్లాహ్ సైన్యంగా ఏర్పడాలి. ఈ సమావేశ అభ్యాసం రోజుకు అయిదుసార్లు వారిచేత చేయించబడుతుంది. ఎందుకంటే ప్రపంచంలోని సైన్యాలన్నిటికంటే కఠినమైన డ్యూటీ ఈ దైవ సైన్యానికే నిర్వహించవలసి ఉంటుంది. ఇతర సైన్యాలకు యుద్ధంలో పాల్గొనే అవసరం ఎప్పుడో గాని ఏర్పడదు. దాని కోసమే సైన్యానికి ఎంతో కఠినమైన అభ్యాసం చేయించడం జరుగుతుంది. అయితే ఈ దైవ సైన్యానికి ఎల్లవేళలా షైతాను శక్తితో పోరాడ వలసి ఉంది. అన్నివేళలా తన కమాండరు ఆదేశాలను పాలించవలసి ఉంది.

ఏకేశ్వరుడైన అల్లాహ్ చట్టాలుగల ప్రభుత్వాన్ని స్థాపించాలన్నది దేవుని అభిమతం అని మీరు తెలుసుకోగలరు. ఈ మహోన్నత సేవా బాధ్యత ఏదైతే మీకు అప్పజెప్పడం జరిగిందో దీన్ని కేవలం ఒకే ఒక ముస్లిమ్ నిర్వహించజాలడు. ఒకవేళ కోట్లాది ముస్లిములు ఉండి కూడా వారంతా వేరు వేరుగా అందుకు కృషి సల్పినా వారు షైతాను దాసుల సంఘటిత శక్తిని త్రుంచలేరు. దానికోసమైనా ముస్లిములంతా కలసి ఓ సంఘంగా రూపొందాలి. ఒకరి నొకరు సహకరిస్తూ పరస్పరం ఒకరికి ఒకరు వెనుదన్నుగా నిలవాలి. అంతా కలిసి ఒకే ధ్యేయం కోసం పాటుబడాలి.

మరికొంత లోతుగా ఆ గ్రంథాన్ని అధ్యయనం చేస్తే, ఇంత గొప్ప ధ్యేయం కోసం ముస్లిములు కేవలం సంఘటితం కావడమే సరిపోదు, ఈ కలయిక లేక ఈ సంఘటన సరైన రీతిలో జరగాలి అనేది గ్రహించగలరు. అంటే ముస్లిముల జమాఅత్‌లో (సంఘంలో) వారి సంబంధాలు పరస్పరం ఉండవలసిన రీతిలోనే ఉండాలి అన్నమాట. వారి మధ్యగల సంబంధ బాంధవ్యాల్లో ఎలాంటి లోపం ఉండకూడదు. వారిలో పూర్తి సమైక్యత ఉండాలి. వారంతా ఒకే నాయకునికి విధేయులై ఉండాలి. ఆ నాయకుని ఆదేశాల కనుగుణంగా పనిచేసే అలవాటు వారిలో జనించాలి. తమ నాయకుని పట్ల విధేయత ఎలా పాటించాలో, ఎంత వరకు పాటించాలో, ఇంకా అవిధేయత చూపే సందర్భం ఏదీ? అన్న విషయం కూడా వారు తెలుసుకోవాలి.

ఈ విషయాలన్నిటిని దృష్టిలో ఉంచుకొని సామూహిక నమాజు ఈ పనులన్ని ఎలా నిర్వహిస్తుందో చూడండి.

అజాన్ పిలుపు వినగానే మీ పని బాటలన్నీ వదులుకొని మస్జిద్ వైపునకు రండి అనే ఆదేశం ఉంది. హాజరు కావడానికి పిలిచే ఈ పిలుపును విని అన్ని వైపుల నుండి ముస్లిములు బయలుదేరి ఓ కేంద్రం (మస్జిద్) వద్ద సమావేశం అవడం వారిలో ఓ సైన్యం యొక్క మనోస్థితిని కలుగజేస్తుంది.

ఉద్భవింపజేస్తుంది మనిషిలో. ఈ సుగుణాలన్ని నిజమైన దాసునిగా మలచడానికి అవసరమైన సుగుణాలే.

అయితే మీరు జాగ్రత్తగా ఆలోచిస్తే మీకు అవగతం అయ్యేదేమిటంటే మనిషి ఎంత పరిపూర్ణుడు అయినా, అతనికి ఇతర దైవదాసులు సహకరించకపోతే అతడు దైవదాస్య బాధ్యతను పూర్తిగా నిర్వర్తించజాలడు. సమాజంలో రేయిం బవళ్ళు తనతోపాటు మసలే వారు తనతో సతతం వ్యవహారాల్లో పాలు పంచుకునే వారు, ఇతనికి ఈ దైవ దాస్యంలో చేదోడు వాదోడుగా ఉండకపోతే అతడు దైవాదేశాలను పూర్తిగా శిరసావహించలేడు. మనిషి ఈ లోకంలో ఒంటరిగా పుట్టలేదు. ఒంటరిగా ఉండి ఏ పనీ చేయలేడు. అతని జీవిత మంతా బంధుమిత్రులతో, స్నేహితులతో, పొరుగువారితో తనతో లావాదేవీలుగల వారితో ఇంకా తన జీవితంలో తనతో సహకరించే వారందరితో అనేక రకాలుగా సంబంధాలు కలిగి ఉంటుంది.

అల్లాహ్ ఆజ్ఞలు కూడా కేవలం ఒక్క మనిషి కోసం కాదు, తనతోటి వారితో పైసంబంధాలు చక్కదిద్దుకోవడానికే. ఒకవేళ వీరంతా దైవాజ్ఞల్ని పాలించడంలో ఒకరికొకరు సహకరించుకుంటే, ఒకరికి మరొకరు చేదోడు వాదోడుగా ఉంటే అందరూ దైవానికి విధేయులుగా మారవచ్చు. అలా కాకుండా, అందరూ అవిధేయతకు ఒడిగడితే, లేక వారి సంబంధాల మూలంగా దైవాజ్ఞాపాలనలో వారు పరస్పరం సహాయకులు కాకపోతే, ఒక మనిషికి తన జీవితంలో దైవాదేశాలను సరిగ్గా పాటించడం సాధ్యం కాదు.

మీరు దివ్యఖుర్ఆన్‌ను బాగా లోతుగా అధ్యయనం చేస్తే, కేవలం మీరొక్కరే అల్లాహ్ విధేయులుగా ఉండాలన్నది దైవాదేశం కాదు. మీతోపాటు ప్రపంచ మానవులంతా దైవానికి విధేయులై పోవాలని, ప్రపంచంలో దైవ చట్టాలే జారీ కావాలని, షైతాను చట్టాలన్నింటిని తుదముట్టించి వాటి స్థానే

# సామూహిక నమాజు

ముస్లిమ్ సోదరులారా! గత ప్రసంగాల్లో నేను కేవలం నమాజు ప్రయోజనాలను మాత్రమే మీ ముందుంచాను. ఈ ఆరాధన ఎంత బలవత్తరమైందో, మనిషిలో దైవ దాస్యభావనను ఎలా పెంచుతుందో మీరు గుర్తించే ఉంటారు. అదే కాకుండా మనిషిని ఆ దాస్య భావనకు న్యాయం చేకూర్చడానికి ఎలా సమాయత్త పరుస్తుందో కూడా గ్రహించి ఉంటారు. ఇప్పుడు నేను సామూహిక నమాజు (నమాజె బాజమాఅత్) ప్రయోజనాలేమిటో తెలుపదలుచుకున్నాను. దీనిద్వారా మీరు, దైవం తన అనుగ్రహంతో ఒకే దానిలో మనకోసం ఎన్ని వరాలను, ప్రయోజనాలను సమకూర్చి పెట్టాడో అర్థం చేసుకోవచ్చు. అసలు నమాజే ఓ గొప్ప వరం అనుకుంటే దానికి తోడు 'జమాఅత్' ఆదేశం ఇచ్చి దానికి మరింత బలం చేకూర్చడం జరిగింది. మనిషిని పూర్తిగా మార్చి వేయడంలో దానికి అదేసాటి. అందుంచబడిన శక్తే అలాంటిది!

జీవితంలో, ఎల్లవేళలా మీరు దైవ దాసులే. విధేయతకు వెనుకంజ వేయని దాసునిగా, యజమాని ఇష్టానికి కట్టుబడి ఉండాలి. యజమాని ఆదేశ పాలనకు ఎల్లవేళలా సిద్ధంగా ఉండడమే అసలైన ఆరాధన, నమాజు ఈ ఆరాధన కోసమే మనిషిని తయారు చేస్తుంది. ఈ విషయాలను నేను ఇంతకు ముందే చెప్పివున్నాను. ఇదే కాకుండా, ఈ ఆరాధనకోసం మనిషికి కావలసిన సుగుణాలేవైతే ఉన్నాయో అవన్నీ ఈ నమాజు వల్ల లభిస్తాయి అని కూడా చెప్పాను. దాస్య భావన, దైవం, దైవ ప్రవక్త మరియు దైవ గ్రంథంపై విశ్వాసం; పరలోకం యందు ప్రగాఢమైన నమ్మకం, దైవభీతి, అగోచర విషయాల జ్ఞానం కూడా దేవునికి వుందని తలచడం, దైవదాస్యం కోసం సర్వకాల సర్వావస్థల్లోను సిద్ధంగా ఉండడం, దైవాదేశాల్ని తెలుసుకోవడంలాంటి సుగుణాలన్నీ నమాజు